నెలరేక చిగురు వె
న్నెల వెలుగు జొంపాల
నిలువ నీడలు మంచు
తెరల.... మబ్బుల మేడలో....

పవమాన కులమాని
నీ మాలతీ కోర
కామోద మధుయామి
నీ.... వేళలో....

తారకలు విరియు బూ
సిన మించుతీవ లొర
సిన ఆణిముత్యాల
శాల.... మొగసాలలో....

వలపు పండిన చెలీ !
నిలువలేదే కమను
డలుక చాలించవేమే....

*



అంకితము

శ్రీమతి మృణాళినికి

*

# కథలు

*



*

*
* *

—ఫలానానాటికి వస్తూన్నానని, ముందుగా ఉత్తరం వ్రాశాడు. మిత్రులదగ్గరనుంచి, తప్పకుండా... ఎన్ని ఆటంకము లున్నా వీలుచేసుకుని బయలుదేరిరావలసినదని, జవాబులు కురిసి నవి. స్టేషనునుంచి టెలిగ్రాం యిచ్చాడు, రైలులో అడుగుపెట్ట బోతూ. దిగినతరువాత... స్వాగతం ఇవ్వడానికి... ఇంత హంగా మాతో ఆహ్వానించిన మిత్రులలో... ఒక్కడూ కనబడలేదు:

ఎంతవయసువచ్చినా...తత్త్వములలో ఏమీ మార్పులేదన్న మాట ! ఇదివరకూ అంతే: వాళ్ళను నమ్ముకుని ఏపనీ తలపెట్ట డానికి వల్లనయేదికాదు. అభాసచేయడంలో, మొనగాళ్ళు ! నాటికీ నేటికీ అదేవరుస...

తారకానికి, స్నేహితులు మొగంతప్పించినందువల్ల కోపం రాలేదు, కాని... హుషారీకి అంతరాయము కలిగినందుకు చిరాకు పడ్డాడు. ఎరుర్కొనడానికివస్తే, వాళ్ళనెత్తిన ఎక్కికూర్చుని, వదల దేమోనని ఎవరికివారు మెదలకుండా ఊరుకుని ఉంటారు. వచ్చిన వాడు కనబడకుండా ఎక్కడికిపోతాడు... తీరుబడిగా కలుసుకొన వచ్చును కదా అనే దిలాసాతో... వీళ్ళయిల్లు బంగారం కానూ...

—రైలు బందరు సమీపించినకొద్దీ, అతనికి, ఆ సంతోష సమయంలోకూడా... వెనుకటి గాథలు తలపుకువచ్చినవి. అక్కడ గడపిన... అజ్ఞాతజీవనము... ఆనాడు, ఆవరించి... ధ్వంసము

*
* *

—ఫలానానాటికి వస్తూన్నానని, ముందుగా ఉత్తరం వ్రాశాడు. మిత్రులదగ్గరనుంచి, తప్పకుండా... ఎన్ని ఆటంకములున్నా వీలుచేసుకుని బయలుదేరిరావలసినదని, జవాబులు కురిసినవి. స్టేషనునుంచి టెలిగ్రాం యిచ్చాడు, రైలులో అడుగుపెట్టబోతూ. దిగినతరువాత... స్వాగతం ఇవ్వడానికి... ఇంత హాంగామాతో ఆహ్వానించిన మిత్రులలో... ఒక్కడూ కనబడలేదు:

ఎంతవయసువచ్చినా...తత్త్వములలో ఏమీ మార్పు లేదన్నమాట ! ఇదివరకూ అంతే: వాళ్ళను నమ్ముకుని ఏపనీ తలపెట్టడానికి వల్లనయేదికాదు. అభాసచేయడంలో, మొనగాళ్ళు ! నాటికీ నేటికీ అదేవరుస...

తారకానికి, స్నేహితులు మొగంతప్పించినందువల్ల కోపం రాలేదు, కాని... హుషారీకి అంతరాయము కలిగినందుకు చిరాకు పడ్డాడు. ఎదుర్కొనడానికివస్తే, వాళ్ళనెత్తిన ఎక్కికూర్చుని, వదలడేమోనని ఎవరికివారు మెదలకుండా ఊరుకుని ఉంటారు. వచ్చినవాడు కనబడకుండా ఎక్కడికిపోతాడు... తీరుబడిగా కలుసుకొనవచ్చును కదా అనే దిలాసాతో... వీళ్ళయిల్లు బంగారంకానూ...

—రైలు బందరు సమీపించినకొద్దీ, అతనికి, ఆ సంతోష సమయంలోకూడా... వెనుకటి గాథలు తలపుకువచ్చినవి. అక్కడ గడపిన... అజ్ఞాతజీవనము... ఆనాడు, ఆవరించి... ధ్వంసము

చేసిన నిరాశలు... చివరకు తెగించి... స్వస్థలమనే మమకారము
4 త్రెంచుకుని... ఆ చవిటిపర్రిలోంచి తప్పించుకుని బయటపడి...
నానాఅవస్థలూపడి... తుదకు మదరాసులో స్థాయిచిక్కించుకుని...
పేరు... ప్రఖ్యాతి... జీవనపూర్ణశోభలు!...

ఈనాడు... తెలుగువారిలో తారకంకన్న, ప్రఖ్యాతుడు... చిత్రికారులలో:.. లేడు. అతని రచనలు... కళాసృష్టి... విశ్వమోహానమై వెలసినది: అతనిని బహూకరించని దేశములు లేవు. అతని చెలిమికి గర్వపడని మహామహులు లేరు...

కాని... తారకంతోడివారందరూ, వెనుకటి పాదులోనే... ఎదుగూ బొదుగూ లేక కుదురుకుపోయి... ప్రజ్ఞలను వ్యర్థంచేసుకుంటూ... బందరును విడవకుండా వున్నారు. ఎన్నోవిధాల ప్రయత్నంచేశాడు—ఆ మత్తు వదలగొడదామని,... తనవద్దకు పిలిపించుకుందామని. కాని... కదల్పడం,... వాళ్లని మరమ్మతు చేయడం... బ్రహ్మకైనా తరమా...? అడవిలో కాచే వెన్నెలను పట్టణములమీదకు మరలించడం ఎవరికి శక్యమౌతుంది?... చేతనైన సాహాయ్యము మాత్రం దూరానవుండే చేస్తూండేవాడు.

ఊరు విడిచివెళ్లిపోయేటప్పుడు... ఆ అవస్థమారి ... ఉన్నతమైన స్థితివస్తేనే కాని... తిరిగి చూడకూడదనుకున్నాడు. కాలం గడచినకొద్దీ... అనుకున్నంతకన్న ఎక్కువ పదవికి అందుకున్నా... ఎన్నిమార్లు బయలుదేరి, ఒకమారు... స్వస్థలమును దర్శించవలెనని అనుకున్నా...ఎప్పుడూ, ఏదో అడ్డంకి తగులుతూండేది. పైగా... బంధువులు, నా అన్నవారూలేని... ఏకాకి-బ్రహ్మచారి కావడం మూలాన, రాకతప్పని అగత్యమూ ఏమీ కనుపించలేదు, ఇంవరకూ.

తలవని తలపుగా... తీరిక లభించింది. మైసూరు రాజభవనమునకు చిత్రములు తయారు చేయడం, అనుకున్నంత కన్న త్వరగా అయిపోయింది... అహోరాత్రములూ అదేపనిగా కష్టించ

డం మూలాన, ఎకాడమీకి పంపవలసిన బొమ్మలు మొదలు పెట్టడానికి... ఇంకా వ్యవధి ఉన్నది. ఈ లోపున కొంత విశ్రాంతి తీసుకుని మనసూ చేయీ మామూలు సాఫీలోకి... తెచ్చుకోవడం అవసరం. సరే, అన్నీ కలిసివచ్చినవి కదాఅని... ఇంతలో మిత్రులు రమ్మని ఉత్తరములు దూకించడంచేతనూ... బయలుదేరాడు.

ఊరువిడిచి అయిదారు సంవత్సరములైనా:.. ఇంకా ఎరుగున్నవారు లేకపోలేదు. ఎవరియింటికి వెళ్ళినా, కాదనరు: నెత్తిన పెట్టుకుని మర్యాదచేస్తారు: కాని, తారకానికి ఆపద్ధతి మనస్కరించలేదు. పైగా...తాను వచ్చానని తెలియడంతోనే...ఊరివారందరూ విరగబడి... ఊపిరి సలుపనియ్యరేమోననే భయం. అందుకనే కాదూ, కారూ, నౌకరులను ఎవ్వరినీ వెంటతీసుకు రాకుండా అజ్ఞాతంగా వచ్చింది?...అత్యంతాప్తులకు... . అతని సహవాసులకు తప్ప ఆగమనవార్త తెలియనీయంది? గుట్టుచప్పుడు కాకుండా, ఉన్న నాలుగురోజులూ, మిత్రులతో సరదాగా గడిపి... తిరిగి వెళ్ళిపోవాలని... అతని ఊహ:

బండి చేసుకుని తిన్నగా 'టి. బి.' కి వచ్చేశాడు. భోజనాదికములు పూర్తిచేసుకుని, ప్రయాణం బడలికతీర్చుకునేందుకు... టీ వేళదాకా విశ్రమించి, అప్పటికికూడా, దొరలు ఎవరూ దిగకపోతే, ఖబురు చేయవచ్చుననుకున్నాడు...

కాస్త, కనుమూశాడోలేదో... ఆ, మిడసర్లగ్నంలోనే... వాళ్ళకు లెక్కా జమా ?... మిత్రమండలి ప్రత్యక్షమైంది. వారు రావడంచూసి... కపటనిద్రను అభినయించి... గిలిగింతలతో బోర్లగిలి, మారాంచేసి... లేచికూర్చుని... అన్నాళ్లకు వాళ్లను చూసిన...సంతోషంలో... మొదటి కోపం మరచిపోయి... వెనుకటి లీలలు జ్ఞప్తికి తెచ్చుకుంటూ, నిర్విచారంగా... పండువుగా... రోజంతా గడిపేశాడు.

సాయంకాలం... కనుచీకటి కమ్ముకుంటూండగా బంధువులు
6 చేరి... (పట్టపవలు బయటికి రావడానికి తారకం ఒప్పుకోలేదు)...
పరిచయస్థలములన్నీ కలియవేసి... విసుగూ విరామంలేకుండా,
తిరిగి... తిరిగి, హోటలులో భోజనంచేసి... అలసిపోయినందువల్ల,
మరునాడు ఉదయం కలుసుకోవచ్చునని కూడబలుకుకుని... తార
కాన్ని జట్కాలో పంపివేసి... ఎవరికి వారు సర్దుకున్నారు...

—పన్నెండు కావచ్చింది. వెన్నెల, బాగా స్వచ్ఛంగా, పులుకడిగిన ముత్యపు జిగి మెరయించుతూన్నది. వచ్చి వసారాలో నడుము వాల్చాడు. ఆనంద పారవశ్యంలో కైపు ఎక్కిపోయిన మనసు... తీయదనం విడిచి... స్వాధీనం కాకుండా... వింతభావములు మొలకలెత్తించుతూన్నది. ఆతని ఆలోచనలు... ఎన్ని పంథాల స్వైర విహరణ చేసినా... చివరకు, తిరిగి... శిల్పారామమున విడియవలసినదే...! వెన్నెల తీవలు, నీలాంబుద శకలములూ కలిసి... చిత్రసామగ్రి అయి... రమ్యాకృతులకు రేఖామూర్తులు దిద్దడం మొదలుపెట్టినవి. ఆతని మానసవీధిని... వెన్నెల...!... అంతా... లోకమంతా... వర్ణసంహారము చేస్తూ... ధాతు వికారమును... ముంచివేసి... తళతళలాడే... తెల్లని వెన్నెల!... ఆ... అలవికాని అందాన్ని అంతా... కుంచెకొనల ఏల అమర్చుకొనకూడదూ...? "బ్లూ బాయ్" కి వచ్చిన మెప్పులు... "వెన్నెల కన్నె"... ఏల అందుకోదు...?...

—ఆలోచనలకు వశంవదుడైనందువల్ల... లేచినది,... నడచి... బేసిన్ దగ్గరకు వచ్చి... కాలువగట్టున... ఇసుకలో... నడచి పోతున్నదీ... స్పృహకురాలేదు. వెన్నెల వెలుగులో రూపేర్పడుతూన్న... దివ్యమూర్తి... అందకుండా... అందుబాటుగా కనబడుతూ... లాక్కొని వెళుతూన్నది... అందకుండా వెళుతూ...

ఆగిపోయింది...! తారకం... గమనానికి నిరోధముకలిగి... నిలిచిపోయి... తెలివితెచ్చుకుని...

చూశాడు...! కాని... కల ఇంకా నడుస్తూన్నదేమోననే అనుమానం— ఆ అమ్మాయిని చూచి, సమీపించినతరువాతకూడా పోలేదు. సామాన్యయువతి... రూపమోహిని, ఒంటరిగా... అర్ధరాత్రివేళ... అక్కడ... నీటిఅంచున ఎందుకు నిలుచుని ఉంటుంది?...

సమీపించడం అలికిడి... ఆ అమ్మాయి ధ్యానమునకు భంగము తెచ్చింది. చూసి, బెదరుతూ... గబ గబ వెనుకకు నాలుగు అడుగులు వేసి... పరుగెత్తబోయి... కాళ్లు ఆడక... కూలపడిపోయింది...

కామినీ గ్రహములను గురించి కథలు అనేకం విన్నాడు. కనుపించుతాయేమోనని... ఎన్నిసార్లో వెదకి... నిస్పృహతో... వట్టిమాటలని తేల్చుకున్నాడు. ఆ విషయాల్లో మొదటినుంచీ ఏమీ నమ్మకములేదు. భయమనేది ఎన్నడూ ఎరుగడు. అందువల్ల యవ్విధమైన గాభరా అతన్ని ఆవేశించలేదు,—ఎవరో... ఎందుకు అక్కడ ఉన్నదో అనే... ఆలోచన పోయినదే తప్ప.

'ఎవరు... నీవు...'

ఆమె, కూర్చుని తలవంచుకుని ఉన్నది. తారకం, దగ్గరగా చేరి నిలుచుని... మిూదుగా... ఈలా అడిగాడు. ఆమె, మాటాడకుండా... భయపడుతూన్న దానిలాగు... వణికి పోవడం మొదలు పెట్టింది.

'ఫరవాలేదమ్మా!... నీవు... ఎవరోచెప్పు ...? ఈ వేళప్పుడు... ఇక్కడికి ఏలావచ్చావు...?'

—జవాబుగా... వెక్కి వెక్కి యేడ్వు ప్రారంభించినది. ఆతడు... కూర్చుని, బుజ్జగించుతూ... వీపుతట్టి ... ఘుడపుడిగించవలెనని... చూశాడు...

'నేను... నే...ను... చ... చ్చి పోతాను...'

వెక్కుతూ... అక్షరమక్షరం... ఈమాట చెప్పింది. విని, ఆతడు చలించాడు. కాని, అధీరభావము పైకి తొణకనీయకుండా... చులాకనగా... పరిహాసమునకు లాగు... నవ్వేసి—

'మా... ఘనకార్యం...లే! ఇంటికి వెళుదువు కాని. నేను వెంటవచ్చి అప్పగించుతాను. చూడు, ఏలా పండిపోతున్నదో చూడవమ్మా... వెన్నెల...! ఇంతచక్కని వేళ... చచ్చి పోవడం కన్న... వేరే ఏం తోచలేదూ... నీకు ?"

—మాటలు చెపుతూ... అనునయించుతూ, ఆమెను... అనన్యభావంతో... అనాలోచితంగా, చూస్తూన్న కొద్దీ... తారకం... దహరాకాశమున పొడసూపిన వెన్నెలమొన... క్రమంగా మనస్సంతా ఆవరించింది. వెన్నెల తేటలన్నీ కుదించుకుని... ఏర్పడి పోయిన ఆకృతి... ఆమెకు అచ్చంగా ప్రతిబింబాలాగా ఉన్నది. పొంకములై... లాలిత్యము ఉట్టిపడే... ఆ... అవయవ రేఖలను... చిత్రరచనలలో సమకూర్చ గలిగితే... ధన్యుడు...! చిక్కవిడి పోయింది. తలవని తలపుగా... సమకూరిన పెన్నిధిని... ఏల వ్యర్థం చేయవలె... ?— అంత చక్కని 'మాడెల్'...

మనసులోని సంతోషం... ముఖంలో స్పష్టంగా కనబడుతూన్నా... ఆతని ప్రసన్నతను... ఆ అమ్మాయి అర్థంచేసుకోలేదు. ఆమె గొడవ... ఆలోచనలు... ఆమెవి!

'ఏమమ్మా! లే... యింటికి...వెళుదాము'— అని సంభాషణ మొదలువేయడంకోసం... ప్రయోజనంలేని ప్రశ్న వేశాడు...

'నేను... వెళ్లనండీ...'

'ఏమీ ,...'

'పెద్దపులి బోనులోకి... ఎరుగుండి ఎవరు పోతారు?'

'అలాగా... మరి, ఏం చేస్తావు?'

'ఏమైపోతానో... నన్ను విడిచి... మీ దోవను మీరు... వెళ్ళండి...'

'అయినా... చెపుదూ... అంతకష్టం ఏంవచ్చింది?'

'ఎందుకులెండి... నా కష్టాలు...'

'కష్టాలు... ఎవరితో చెప్పక దాచేసుకుంటే, మరీ... వేధించుతవి. నామీద నమ్మకంలేదూ...? నేను ఆప్తుణ్ణి అని భావించవచ్చును...'

'మిమ్ములను చూడగానే... మర్యాదస్తులని తోచింది గనుకనే...'

'అయితే సంకోచం ఎందుకూ...? రా...రికామీగా మాటాడుకుందాం. నేను... అదిగో... ఆ బంగాళాలో ఉంటున్నాను. లే, వెళుదాం...'

—ఆ అమ్మాయి... మారుమాటాడకుండా లేచి, తారకం వెంట నడచి వచ్చింది. 'టి. బి.'... హాలులో, ఒక ఈజీ ఛైర్‌లో ఆమెను ఆసీనను చేసి... బలవంతంచేసి... ఫ్లాస్కులోని... టీ... కొంచెం ఆమెకు పంచియిచ్చి... తానూ సేవించి... పాందాను... బల్లమీద, ఆమెకు అందుబాటులో ఉంచి...బ్రైయర్... ధూమదళ ఖండములతో నింపుకుని... రగలించి... పొగలు గుప్పున చిమ్ముతూ... మేజాను ఆనుకుని ఆమెకు ఎదురుగా... కథ... వివరములు వినడానికి సంసిద్ధుడుగా ఉన్నానని తెలియచేసే వైఖరిలో నిలుచున్నాడు...

ఆమె... అతని నిదానం చూసి... స్వాస్థ్యం కుదిరించుకుంటూ... మనసు విప్పి... దాపరికం లేకుండా, యావద్వృత్తాంతమూ... విశదీకరించడానికి ఉపక్రమించింది:

'... నాపేరు... సూర్యకాంతం. మా అమ్మ... సాని: మీరు... ఈ ఊరివారైనట్టయితే, పద్మావతిపేరు ఎరిగే ఉందురు.

మా కులమువారిలో, మేమంటే అందరికీ కన్ను ఎర్ర. మా అమ్మ సంపాదన, అనుభవం... ఇంకొకరికి రాదు: మాతండ్రి, యీవైపుల కల్లా పేరు ఎన్నికఉన్న జమీందారుడు. ఇప్పటికి ఆయన చనిపోయి, పదిసంవత్సరాలు అయిందిలెండి:

'చదువూ సంగీతం... విషయాల్లో — మా అమ్మ నాకు ఏమీ లోపం చేయలేదు: ఆవిడ ఇప్పుడు దెప్పటానికి అదే వంక దొరకింది,... ఈ చదువులే ఇంతవరకూ తెచ్చి ... ఆమె మాట నేను వినకుండా పోవడానికి కారణమని...

'నేను పెద్దదాన్ని అయినతరువాత, కులవృత్తిలోకి దింపవలె నని... ఆమె ప్రయత్నించితే, నేను ఒప్పుకోలేదు. నాకు, ఆలాటి పాడుబ్రదుకు మీద రోత. ఒకొక్కప్పుడు, మా కులములో తప్ప బుట్టినాను అనిపిస్తుంది. మావాళ్లూ ఆలాగే అంటారు:

'మాఅమ్మ, నన్ను ఒక లక్షాధికారి... వైశ్యభల్లూకం పరం చేయడానికి... తీర్మానించుకున్నది. నేను ఎంత బ్రతిమాలినా వినడంలేదు: ఆమె పంతం చెల్లించుకుని తీరుతుంది: అడ్డుచెప్పేవారు ఎవరూ లేరు. ఆమెను ఎవరైనా ఎదిరించి, బ్రతికి బయట పడడమే...? మా యింటికి, మా అమ్మ... పెద్ద ముసోలినీ...

'మా వీధిచివరను ఒక శాస్త్రులగారు ఉన్నారు. వాళ్ల పిల్లవాడు... కామేశం అని... మేము ఇద్దరం చిన్నప్పటినుంచీ సావాసంగా ఆడుకునేవాళ్లం: పెద్దదాన్ని అయినకొద్దీ... మేము, కలసి మాట్లాడుకోకుండా... మా ఉభయుల పెద్దలూ కట్టుదిట్ట ములు చేశారు. ఏం ముణుగుతుందో అని వాళ్లకు భయం: కుల గౌరవం...... బ్రాహ్మణీకం ఎక్కడ మంటకలసిపోతుందో అని ఆ శాస్త్రులుగారు కొడుకును వేయి కళ్లతో కనిపెట్టి ఉంటూన్నాడు:

'మా అమ్మకు కామేశమంటే అసలు సరిపడదు. అందంగా వుంటేమాత్రం... మంచివాడైతేమాత్రం... లక్షాధికారి కానప్పుడు,

తన కూతురుమీద కన్నువేయడానికి ఒప్పుకుంటుందా?... అతనేదో బ్యాంకులో గుమాస్తా ఉద్యోగం చేస్తున్నాడు: వాళ్లకు స్థితి ఏమీ లేదు......

'నేను కలుసుకునేందుకు వీలులేకపోయినా... నేను పడుతూన్న బాధలన్నీ ఆతనికి తెలుసును. తెలియదూ... లోకానికి ? ఈలాటి విషయాలు ఎంతదాచినా గుప్పుమంటాయి: అందులో, సానికొంపకు... రహస్యమూ ?...

'కీరపండరి ఉత్సవాలకు... మేము ఓనాడురాత్రి చూడటానికి వెళ్లాము: అక్కడ కామేశం కనిపించాడు : చూడగానే నాకు ప్రాణం లేచివచ్చింది : మా అమ్మా వాళ్లూ విఠల్ భజనలో మగ్నులై ఉండటం మూలాన, నేను ... ... లేచి, ఆతని దగ్గరకు వెళ్లాను: నన్నుగుర్తించి... చూసినట్టు ఆతడూ సైగచేశాడు లెంకి !...

'చంద్రభాగ ఆవలివేపుకు తిరిగివెళ్లి... అక్కడ కూర్చున్నాం : నాకథ అంతా చెప్పాను : ఎలాగైనా... ఈ చెరతప్పించమని...... ఎక్కడికన్నా తీసుకువెళ్లి పొమ్మని ...... బ్రతిమాలుకున్నాను. పెళ్లిచేసుకుని ఆతనితోనే ఉండిపోవడం నానిశ్చయమనీ... ప్రేమ ఉన్నదని, కామేశానికి తెలుసును : నేనంటే ఆతనికీ చాలా యిష్టం:

'అంతావిని, అప్పుడు చెప్పాడు ఆతను... : నా విషయమంతా తెలుస్తూనే ఉన్నదనీ ... ...పెద్దలచాటువాడు కావడంచేత ధిక్కరించి...అఘాయిత్యం చేయడానికి జంకుతూన్నాననీ..., కాని, సమయంచూసి ... ఏదో ఉపాయం ఆలోచించి ... రక్షించేభారం తనదనీ... నేను ధైర్యం వదలకుండా... తనమీద నమ్మకముంచి... కొంతకాలము ఓర్చుకుని ఉండవలసిందనీ... ఎంతో ఖరారుగా చెప్పాడు...

'మేము, కలసి మాట్లాడినసంగతి, మావాళ్లకు... ఏలాగో మర్నాడు తెలిసింది : కనికరం లేకుండా, మాఅమ్మ నన్ను చావా చితుకాకొట్టింది : వాళ్ల నాన్న... అంతకన్నా పై ఎత్తు ఎత్తాడు : అధికారుల ప్రోత్సాహం ఉన్నది కాబోలు... నిలుచున్నవాడికి నిలుచున్నపాళంగా... కాకినాడ బదిలీ తెప్పించి పంపేశాడు : ఊరుదాటిందాకా... ఎక్కడ నాతో కలుసుకుంటాడో అని... విడువకుండా వెంటాడే ఉన్నాడట :

'ఇప్పటికి... నెలరోజులు అయింది... కామేశం ఖబురు ఏమి తెలియదు : అతడు రాలేదు,... ఉత్తరం వ్రాసి ఎవరిచేతనైనా పంపనూ లేదు : నిరాశ చేసుకుని ఊరుకున్నాడో,... లేక, ఈ రభస అంతా ఎందుకు అనుకుని... నా మాట మరచి పోదామను కున్నాడో... ఏమో.

'ఇవాళ వరకూ, అవతల ఓమూలనుంచి ముంచుకు వస్తున్నా... ఇంకా వస్తాడు... ఇంకా వస్తాడు... అని... కామేశం కోసం ఎదురు చూశాను : ఈరాత్రి నేను... షాహుకారుకు బలి కావలసిన సుముహూర్తం : ఆ నరపశువుకు... నేనెంత బ్రతిమాలినా కనికరం పుట్టదు గద... ! బోలెడు సొమ్ము వ్యర్థం చేసి... నామాటలు విని... విడిచి వెడుతాడా ?... ఇక మా అమ్మ,— ఆ నల్లరాతిలో... దయా దక్షిణ్యాలా ?...

'ఎవరూ చూడకుండా... తప్పించుకుని, సందు దోవను... తిన్నగా... ఏలావచ్చానో?... ఆ మసీదు దగ్గర కూర్చుని... చాలాసేపు... గుండెపగిలేటట్లు ఏడ్చిఏడ్చి సొమ్మసిల్లి పడిపోయి నాను : లేచి... ఆ కాలువలోపడి పోదామని... నిలుచుండగా... మీరు వచ్చారు. నేను... ఎందుకు బ్రతకాలి చెప్పండి...?'

ఆ అమ్మాయి కథ వింటూన్నకొద్దీ... అంతసేపూ... తారకానికి ముఖంలో నవరసములూ... మధ్యమరసం మినహాగా... తర

ళించినవి. ఆమె చివరి ప్రశ్నతో... బాగా... చలించిపోయి... కళ్లనీళ్ళు తెచ్చుకుని... ఆమె చూసి కలవర పడుతుందేమోనని... సంభాళించుకుని...

'ఎందుకు బ్రతకాలా?... ఎందుకో అర్థమౌతుంది... నేను చెప్పినట్టు చేస్తావా?'

'అంటే...'

'నామాటమీద నమ్మకం ఉంచడం...'

'ఆ విషయం తర్కించడమల్లా... మీరు నామనసుకు బాధ కలిగించడం...'

'అచ్ఛా... ఉదయం బయలుదేరుదాం'

'ఎక్కడికీ...'

'చెప్పితీరాలా...'

'క్షమించండి... తెలియక అన్నాను. దానికేమీ అర్థం లేదు...'

'అర్థం తీసేందుకు నేను ఒకడిని దొరికాను కాదూ...! బస్... కొంచెంసేపు నిద్దుర తియ్యి...' ఇంకా మొగమాట మేనా...? ఎగిరివెళ్ళి... నేను చెప్పేటప్పటికల్లా... ఆ మంచంమీద పడాల్సిందేకాని...'

'మరి... మీరు...'

'నాకు... నిద్ర బొత్తిగా సరిపడదు... ముందు ముందు నీకే తెలుస్తుంది కాదూ ...నేను చెప్పడంఎందుకూ... యిప్పుడు...?'

ఆమె... తెగ అలిసిపోయి హైరాను అయి ఉన్న మూలాన... తలగడాకు... తల తగులగానే... కలలులేని నిదుర లోకి వెళ్ళిపోయింది. తారకం పైప్ విసిరివేసి... మరి రవంత టీ గుటకవేసి... సిగరెట్ ముట్టించాడు...

ఉదయం... సౌఖ్యాయనికులుగా మిత్రులు ... టి. బి. కి వచ్చేటప్పటికి ... బాయ్... తారకం ఇవ్వమన్నాడని ఒక ఉత్తరం అందించాడు : చదువుకుని, ధోరణి అర్థంకాక...... అంత అగత్యంగా వెళ్ళిపోవలసిన తొందరపని... ఏం జ్ఞాపకం వచ్చిందా అని, వాచరుకు సంగతి యేమైనా తెలుసునేమో అని ... ( టి. బి. వాచరుల తత్త్వం తెలియదేమో) ... రకరకాల ప్రశ్నలువేసి ... ఏదీ తేల్చుకోలేక... హతాశులై తిరిగి వెళ్ళిపోయినారు, విధిని నిందించుకుంటూ :

—రైలుకు బయలుదేరితే, అందుకోడం కష్టమౌతుందేమోనని టాక్సీమాట్లాడుకుని...... బెజవాడలో, ఎక్స్‌ప్రెస్, కేచ్ చేసి... దీపాలు పెట్టిన తరువాత మదరాసు చేరుకున్నాడు,— తారకం ఆ అమ్మాయితో సహా. ప్రయాణం చేస్తూన్నంతసేపూ... సూర్యకాంతం తగని దిగులుతో... భయంతో... ఏమీమాటాడకుండా... ఒకమూలను ఒదిగికూర్చుని... కాస్సేపు పడుకుని... అలా ఏకాంతవాసమే చేసింది. భోజనం... ఊరికే ఎంగిలిపడి లేచింది.

తారకం... ఆమె ధోరణి కనిపెట్టి... అట్టే మాటాడించకుండా... ఆ అమ్మాయి మానాన ఆమెను వదలిపెట్టి... 'స్టాల్' లో కొని తెచ్చుకున్న పత్రికలు ముందు వేసుకుని పొద్దుపుచ్చాడు.

బేసిన్ బ్రిడ్జినుండి ఫోను చేసినందువల్ల... సెంట్రలులో దిగగానే... కారు సిద్ధంగా ఉన్నది. నౌకరు, డ్రైవరూ, నమస్కరించి...వినయంతో సమీపాన నిలవబడినారు :

సామానులు...వేరే బండి కుదిర్చి యింటికి పట్టించమనీ... ఇంకా గృహకృత్యపు విషయాలూచెప్పి, వాళ్లను పంపివేసి... కారులో, సూర్యకాంతమును వెంటవేసుకుని...పురవైభవం...విద్యుత్కాంతులజాడను...ఆమెకు కనువిందు చేయవలెనని...బయలు

దేరి...తిరిగి బీచికి వచ్చి.....చల్లనిగాలి అనుభవించుతూ, కారు నెమ్మదిగా నడపించుతూ... తొమ్మిదిన్నరకు స్వగృహప్రవేశం 1 చేశాడు.

సూర్యకాంతం, పుట్టి పెరిగిన తరువాత...మదరాసు...అదే తొలిసారి చూడటం. పవలు కావుగనుక... దీపకాంతులలో... నీడలలో...పట్టణ సౌభాగ్యంచూసి విభ్రాంతి చెందినది. ఆ విస్మయంలో ఉండగానే...తారకం యింటికి రావడం! భాగ్యవంతులైనా... ఎన్నడూ బందరు విడిచి రానందువల్ల... ఆ యిల్లు చూడగానే... కథలలో చదువుకున్న... ఇంద్రభవనం ప్రత్యక్షమైనంత ఆశ్చర్యం పొందింది. తారకం మాటా మర్యాదా చూసి నమ్మకస్థుడైన ఎవరో పెద్దమనిషికదా అని అనుకున్నదేకాని... ఆతన్ని గురించిన వివరములు ఏమీ... సంభాషణలో రానందువల్ల తెలుకోలేదు. చూసి... చూపులను నమ్మలేక, కలా నిజమా అనే దిగ్భ్రమ... ఆమె కవళికలో కనిపెట్టి, తారకం—

'ఏం సూర్యుడూ! మన... యింటికి వచ్చిన తరువాత కూడా ... ఇంకా నిదురమత్తేనా...? ఒరే ముత్తూ, అమ్మాయి... స్నానం చేస్తుంది... కుప్పమ్మను ఇలా పిలు...' — అని... ఆమెను హెచ్చరించి, కర్తవ్యం ఉపదేశించి... తనగదిలోకి వెళ్ళిపోయినాడు.

— తరువాత, భోజనం చేయడానికి... వచ్చి బల్లదగ్గర కూర్చున్నాడు. సూర్యుడు... మానస సరసిలో జలవిహారం ముగించి, బయలువెడలి మందగమనపు టొయ్యారంతో నాయకుని దరియవచ్చే రాజహంసిలాగా తోచింది, తారకం కళా భావనలో. షాంపూ చేసి, తడి ఆరనందువల్ల తలకట్టు నొక్కులు రేగకుండా, పట్టులాగా ఒత్తుకొనిపోయి ఉన్నది. లోలాకులు, చీరె... మార్చేసింది:

ఆమెను చూడగానే... తారకం లేచి నిలుచుని, ప్రక్కను ఉన్న, ఆసనమును నిర్దేశించినాడు. వెంటనే కూర్చోకుండా, కుర్చీ

చేతిని ఆనుకుని, అర్ధ త్రిభంగిలో పోజుయిస్తూ... నేను అందంగా ఉన్నానా, లేదా ... అనే ప్రశ్నను చూపులలో మెరిపించింది. జవాబుగా, తారకం చట్టున లోపలికి వెళ్ళి, ‘ స్కెచ్ బుక్ ’ తో తయారై, కుర్చీమీద కాలూని, మోకాలిమీద, పుస్తకం ఆన్చి, గబగబ... ఆమె నిలుచున్న పాళాన .. ‘ లైట్‌నింగ్ స్కెచ్ ’ గీశేశాడు —

అంతా కొత్త గనుక, ఆమె కదలకుండా, ఆశ్చర్యపడుతూ, అలాగే ఉండి పోయింది. భోజనసామాగ్రి అమర్చడానికి, వచ్చిన నాయర్... (ఆతనికి అది అలవాటైపోయింది)... యజమాని చేస్తూన్న పని గమనించి, సద్దు చేయకుండా, వెనుకకు తప్పుకున్నాడు.

స్కెచ్ పూర్తి చేసి, తన నిర్వాహకత్వమును... ఒకమారు పరకాయించి చూచి... మురిసిపడి, ఆమెవంక, బింబప్రతిబింబము లను సరిజూసుకుంటూన్నట్టు సమీక్ష చేసి... తృప్తి పడిన భావ ముతో... కాగితమును అందిచ్చాడు. ఆమె... దాన్ని చూస్తూ, కలగంటూన్న దానివలె... నిజముగా... ఆ రేఖామూర్తిని చిత్రశబ లితము చేసినది తన ఆకారమేనా...... అని నమ్మలేకపోతూ, మెచ్చుకుంటూన్న ముఖకళలు మొలకరించుతూ ... చూపు, బొమ్మమీదనుంచి త్రిప్పేసుకోలేని... పరవశ అయిపోయింది.

ఫైలును, స్టంప్‌ను బల్లమీద పడవేసి... తారకం, ఆ అమ్మాయిని రెప్పవేయక కాంచుతూ, ప్రశంసోపాయనమును అందు కొనడానికి సంసిద్ధుడై ఉన్నాడు...

‘ చాలా... బాగున్నది. ’

‘అవును... నీ చక్కదనం పంచుకున్నప్పుడు ఆమాత్రంగా నైనా... లేకపోతే,...’

‘నేను... ఇంత అందగత్తెనా !... ’

‘ చెపితే నమ్మవనే... సాక్ష్యం తయారుచేసింది ...’

ఇద్దరూ... నవ్వుకుంటూండటం కనిపెట్టి, నాయర్— అభ్యంతరం తీరినదని... వచ్చి వడ్డించాడు. తీరికగా, ఖులాసాగా ఆకబురూ యీకబురూ చెప్పుకుంటూ భోజనంచేసి... ఆకుమడుపులు అందుకుని... డ్రాయింగ్ రూమ్‌లోకి... మారారు. రేడియోలో, సింగాలీనాటకం, కొలంబోనుంచి... కొంతసేపు విని... సూర్యుడు, నిద్రకూరుకు వస్తూండగా, ఇక కూర్చోలేక, లేచి... వెళ్లిపోయింది— పరిచారిక దోవతీయగా. తారకం, అవిరళంగా, ధూమహోమంచేసి... (ఆలోచనలో ఉన్నప్పుడు... చేతిలో సిగరెట్ ఆరకూడదు— అది ఆతని అలవాటు)... క్రమంగా... అక్కడే నిద్రలో పడిపోయినాడు:

తెల్లవారుతూందనగానే, సూర్యుడు, కొత్తచోటుగనుకనూ, మనసులో బెరుకు ఇంకా తీరనందువల్లనూ, సరిగా నిద్రపట్టక... లేచి, తోటలోకివచ్చి, ప్రభాతమలయూంకూర సాహచర్యమున బడలికలు తీర్చుకుంటూ, షికారు చేస్తూన్నది. ఒకప్రక్కనుంచి, కడవలు పట్టుకుని, గులాబీపొదలవేపు వెళుతూన్న తోటమాలి, ఆమెను చూసి, చేతనున్నవి క్రింద అన్చి... గోరుకో పువ్వుగా తుంచి... కాడలతో గుదిగా కలిపి పట్టుకుని వచ్చి... 'బొకే'...ను అర్పించి, నమస్కరించి, వెంటతిప్పి...తోట అంతా చూపించాడు. కుప్పమ్మ, పూలసజ్జ పట్టుకొని అక్కడకే వచ్చింది. సూర్యుడు దానిని అందుకుని... వనకన్యలాగా... బాలహరిణాంగనలాగా... ఉత్సాహంతో... విలాసంతో పుష్పాపచయంచేసి... ఉబికిపోయేటట్టుగా పూలబుట్ట నింపుకుని, తిరిగి యింట్లోకి వచ్చి... వాజ్‌లన్నీ తనచిన్నారి చేతులతో, అమర్చి... మార్బుల్ పెడస్టల్ మీద నున్న అవలోకితేశ్వరుని పాదముల దగ్గర మందారముల బారుతీర్చి... భక్తి వినమ్రకావడం...

—స్నానాదికములు పూర్తి చేసుకుని, డ్రెస్సింగ్ గౌనుతో, పైప్ రగులుస్తూ అక్కడకు అడుగువేసిన... తారకం కంటబడ్డది. అతడు, ఛలోక్తిగా—

'ఎరుగని దేవులకు మ్రొక్కకూడదు...' అని, విసిరాడు :

సూర్యుడు... గుర్రిక్క తిప్పుకుని, అతనికన్నా కొంటెగా...

'ఎరుగనివాడైతేనేం... నమ్మించే నేర్పుఉన్నప్పుడు... తప్పుతుందా...'— అని, తిప్పికొట్టింది. చక్కనిదేకాక... ఇంత తెలివితేటలుకూడా ఉన్నాయా ఈమెకు... అని తారకం ఆశ్చర్యపడ్డాడు.

కాఫీకప్పులు అందుకుని... నిలుచునే తాగేశారు. టాయలెట్ విధానం పూర్తి చేసుకుని... మళ్లా స్వీష్టకృత్ గా కడుపునింపుకుని... ఊరిలోకి, బయలుదేరి వెళ్లిపోయినారు :

పెద్దపెద్ద షాపులకు వెళ్లారు. ఎక్కడచూచినా, తారకానికి అమితగౌరవం జరగడం... అందరూ, చేతులుకట్టుకుని... కనుసన్నల ఆజ్ఞలు నిర్వర్తించడానికి సంభ్రమించడం... ఇదే అసలు సూర్యుడికి... తగని వింతగా వున్నది. ఇక కొన్న సామానులకు అంతూ బొంతూ లేదు : కోటీశ్వరుల ఛాయాలోనివాడా ఏమి టనిపించింది, ఆమెకు. కొన్నవాటిలో, అన్నీ సూర్యుడికోసమే...! అతను ఖరమాయించడం, ఆమె, చేసే దేమీలేక... సరేనని తల ఊగించడం. నిజానికి, మనసులో, తనకోసం అంతసొమ్ము అతడు వెచ్చించడం చూడగా, కొంచెం కష్టంగానే ఉన్నది : కాని వద్దంటే, తారకం యేమనుకుంటాడో, అతని దర్జాకు ఎక్కడ లోపం చేసినది అవుతుందోనని, కిక్కురుమన లేదు :

ఒకటి రెండు రోజులు, తయారై వచ్చిన నగలను, దుస్తులనూ... కరవుదీరా చూసుకోవడంలో సూర్యుడికి ఊపిరి సలుపడానికైనా, తీరిక లేకపోయింది. సాయంకాలము... షికారుకు, ఏదో మంచి పిక్చర్ ఉంటే... సినీమాకు, మర్నాడు కాబోలు, అతని బలవంతాన వెళ్లింది...

పవలు... చదువుకునేందుకు... వినడానికి, చూడటానికి... ఆ దివ్యహర్మ్యమునిండా, అమూల్యసాధనాలే. ఒక్క నిమిషమన్నా, ఏమీ తోచక పోయేందుకు వీలు లేదు. ఎన్నిరకాల ఆర్ట్సు గ్రంథములు... ఎన్ని విగ్రహాలు, పెయింటింగులు... ఎన్ని... వాద్య పరికరాలు... పయనోలా, వీణె... జితార్... ఎన్నో...

అస్తమానం...అదొక పుణ్యతీర్థములాగ్గా, ఎవరో ఒకరు వచ్చి పోతూండటానికి, విధీ విరామమూ లేదు. వచ్చినవారందరికీ... చాలాభాగం ఆప్తులే కావడం మూలాన...తారకం, ఆమెతో దోస్తీ చేసేవాడు. కొన్నాళ్లకు, ఆతన్ని ఎరుగున్న వారందరూ... ఆమెతోనూ, చనువుగా మాట్లాడుతూండేవారు. కులమర్యాద అయితేనేం... అభిజాత్యలక్షణముకానీ... సూర్యుడు, ఆ బృందంలో కలసిపోయి... గౌరవ మందుకునేందుకు ఎంతో కాలం పట్టలేదు.

ఇంటిలో, నౌకరులందరూ, యజమానితో సమంగా... ఒక్కొక్కప్పుడు అంతకన్నా ఎక్కువగా ఆమెను మన్ననగా చూస్తున్నారు. ఎవరి మనసునైనా వశము చేసుకోగల... వెన్నతో బెట్టిన ప్రక్రియ... ఆశుభావసరములలో... ఆమెకు ఎంతో చేయూత అయి, అక్కరకు వచ్చింది:

— తారకం... నిమిషం, ఏమారకుండా... ఆమెను ఎంతో అపేక్షగా చూస్తున్నాడు. సూర్యుడికి... కొత్త అంతాపోయింది: అతిచనువుగా, మెంకెమూరాములు చేస్తూ... అన్నలు లేని కొరత నంతా తీర్చుకుంటూన్న దేమో అనిపిస్తూన్నది. నిర్మలమైన వాత్సల్యం: మనస్సులో మాట దాచుకోదు. పరాయివాడుకదా అన్న స్ఫురణకూడా లేదు...

ఎన్నోరకాల... ఎన్నో వేషాలతో, ఆమెమూర్తిని చిత్రించాడు: అహోరాత్రములూ, ఆదీక్షలోనే తన్మయుడై ఉన్నాడు. పూర్తిఅయిపోయిన చిత్రశిల్పమును... ప్రదర్శించినట్లయితే...

కళారసికులు... ధనరాసులు దిమ్మరించుకొని... లక్ష్యంచేసుకుని,
20 గేహాలక్ష్మికి అమూల్యాలంకార సంపదను ఘటియించుకునే వారే,... సందేహము ఏమాత్రమూ లేదు— కాని, ఇటీవల, తారకం, ఇంకో పురుగునైనా, స్టుడియోలోకి రానీయడంలేదు: మోడల్సుగా, ఇతఃపూర్వము ఉపకరించిన విలాసినులకు... ఇప్పుడు అతని దర్శన భాగ్యమే కరవై పోయింది: వారితోడి ప్రసక్తే లేదు.

—అతనికి... ఈ చిత్రము లన్నిటిలోనూ, కొరత ఏదో కనబడుతూనే ఉన్నది. మనసులో ఆందోళనను, నిలువ ద్రొక్కుకునేందుకు... కుంచెలకు తీరిక లేకుండా చేశాడేకాని... చిత్రింప వలసిన విశిష్ట-మోహాన-భావనను... ఇంకా వర్ణాంకితము చేసి, రూపేర్పరచడానికి... పూనుకోనేలేదు. అందుకు, కారణం... సంకోచించడము చేతనే...

— ఆనాడు, ఉదయం...సూర్యుడు, స్టుడియోలోకి... మామూలు ప్రకారం వెళ్ళింది: తారకం, పేలెట్‌ను గీకి శుభ్రపరస్తూన్నాడు...

—చేస్తూన్న పని ఆపి, తలఎత్తి, ఆమెవంకచూసి...ఏదో తేల్చుకున్న వాడిలాగా...నిశ్చయంతో...ధీరస్వరంతో...

'సూర్యుడూ...తలుపు గడియవెయ్యి...' అన్నాడు. ఎందుకో, ఆమెకు బోధపడలేదు. ఆనైపులకు, అనుమతి లేనిదే ఎవరూ రావడానికి వీలులేదు. నౌకరులు మాట్లాడటానికి...ఫోను ఉన్నది: ఎంత పరిచయస్తులైనా...యకాయకి అక్కడికిరారు: నౌకరు రానీయడు...

ఏమో, చెప్పాడుకదా, అని, అర్థంకాకుండానే, ఆజ్ఞను పాలించింది.

'ఇలా-రా'

సమీపానికి, బెదురుతూ వచ్చింది. మనిషిలో మార్పు ఏమీ కనబడకపోయినా, ముఖం ప్రసన్నముగానే ఉన్నా...ఏదో, ఒక విశే

షము ఉండిఉండాలి. ఇదివరకు, సంభాషణలలో, ఇంత గంభీరంగా ఆతడు ఎన్నడూ ఉండ లేదు.

'కూర్చో'

—కూర్చున్నది. ఆలోచించుకునేందుకు కూడా వ్యవధానం ఇవ్వడంలేదు. చూపులతోనే, ఆమెను కీలుబొమ్మను చేస్తూన్నాడు. మంత్రముగ్ధలాగా, చెప్పినపని... చేయడమే:

సమీపించి... సూర్యుడికి ఎదురుగా కొంచెం దూరంలో నిలుచున్నాడు... తారకం—

'నేను—నిన్ను రక్షించిన మాట—మరచి పోలేదుకదా?'

'ఈ జన్మకు- మరవడమే! మీఋణం, ఏలాతీర్చుకోడం ?'

'ప్రత్యుపకారం చేసి...'

'చెప్పండి : మీ మాటకు నేను కాదంటానా'

'బాగా ఆలోచించుకో'

'అదేమిటి...అలా అంటున్నారు'

'చెప్పనా'

'సంశయించడం ఎందుకూ, ఏం కావాలి...'

'నీ—శరీరం—'

'ఆఁ—'

'నీ—చక్కదనం—నాకు కావాలి'

ఇంకా అర్థం కాకుండా ఉంటుందా, సూర్యుడికి? చివరకు, ఇదా, పర్యవసానము...? కళాజీవనము- ఈ ఖబుర్లు...అన్నీ అబద్ధమేనా-? ఆతనికీ, కావలసింది తనశరీరము! ఇంతకాలంనుంచీ... లాలనచేసింది, ఇందుకోసమా-? ధనమిచ్చి వశము చేసుకుందామనుకున్న షావుకారుబారినుంచి తప్పించుకు వచ్చింది ... ఈ సింహం

నోట చిక్కుకుని పోయేటందుకా?...ఈతనిలో మాత్రం తేడా ఏమున్నదీ?...కలిగినవాడుకనుక, డబ్బు లక్ష్యంచేయకుండా...తన విలాసమునకు ఉపయోగించుకునేందుకు... కొనుక్కున్నాడా?

మనసులో యాతన, ముఖకవళికలలో...తారకం గుర్తించక పోలేదు; కాని, వెంటనే ఆమె ఆలోచనలకు చేయూతనిచ్చి చిక్కు విడదీయకూడదు. అమెకు సంబంధించిన విషయమును నిర్ణయించుకునే బాధ్యత, మంచిచెడ్డలు ఆలోచించుకోవడం ... ఆమెకే వదిలి వేయాలి. కాని, మాటల్లోమాత్రం, ఏదో నిశ్చయమునకు తరుముకు వెళ్లాలి...

‘ఏమంటావు?’

‘మీకు...న్యాయమా’

‘ఏమీ’

‘మీరు...ఎంతో మంచివారు. ఆపదనుగడిపి గట్టెక్కించు తారనే నమ్మకంలో, భక్తితో, మీ వెంట వచ్చాను. ఇప్పుడు నడియేట మునగమంటున్నారు’

‘ఆలా అంటున్నానా?’

‘ఎందుకు అంటారూ? దోవచూపించుతున్నారు. ఇంత కాలం మీ మనసు స్వచ్ఛమైనదనుకున్నాను.’

‘రైట్...’

‘అప్పుడే ఎందుకు... పడిపోనిచ్చారుకాదు? బ్రతికించింది ఇలావంచన చేయడానికా...? ప్రాణం పోయినా ... తాక నిస్తానా...? నేను...ఎవరిననుకున్నారు?’

— కోపంతో ముఖం జేవురించిపోయి, ఝంఝాక్షుభిత మైన నవ వల్లరిలాగా ఆమె కంపించి పోతూండగా... తారకం,... తుపానుకు అడ్డుతగిలాడు—చిరునవ్వుతో...

'నీవు పొరబాటు పడుతున్నావు'

'కాదు,—కల గని మేలుకున్నాను'

'ఎంత కవిత్వం ఉన్నదమ్మా నీలో!...అందుకనే, నా కాంక్ష మరీ వృద్ధి అవుతున్నది...'

'మీతో మాటాడటానికే— నాకు అసహ్యము వేస్తూన్నది. ఇక...ఇక్కడ ఉండకూడదు'

'ఎక్కడికి ప్రయాణం'

'సముద్రంలోకి...'

'కాదు- కాన్వాస్ మీదికి...వర్ణచిత్రంలోకానికి...! పిచ్చిదానా... ఎంత తల్లడిల్లి పోయినావు...! నిన్ను కామించి నాననుకున్నావా?...శారీరకవాంఛ...ఆ, సుఖమనుకున్నావా నేను కోరింది...? నీ రామణీయకాన్ని... సహజశోభలలో... వన్నెల దిద్దుదామని...'

'అదా...'

'అప్పుడే తేరుకో. నేను అడిగేవరం...? నీవు... సహజంగా... వస్త్రరాహిత్యంగా...'

'ఆఁ... ఆఁ... ఇది ఇంకొక ఎత్తా...? మీ ఎదుట సిగ్గు విడిచి... నగ్నముగా నిలిచిపోవాలా?'

'సిగ్గు... నా ఎదుట ఎందుకమ్మా...? రేఖల పొంకమునే కాని, నాకన్నులు నీ శరీర సౌష్టవమును చూడవు. దేవీమూర్తులను అర్ధనగ్నలుగా చిత్రించే శిల్పి హృదయంలోని పవిత్రభావననే... నేనూ వరముగా అర్థిస్తూన్నది: వయసు తెచ్చిపెట్టిన మాయ సిగ్గును- పసిదానవై పోయి... మాయం చేసుకో...'

'సరే...'

'మనసులో యిష్టము లేనిదీ...సరే అనవద్దు...'

‘మీా మనసును కష్టపెట్టడం...’

‘నీవు పెంకెతనం చేస్తున్నావని కాదు—ఈ మూలాన... కళాసృష్టికి కొరత వస్తుందేమోనని...మనసులో కష్టం...’

‘ఎంత... తెలివిగా మాట్లాడుతారండీ...’

—కలతదీరి, సుఖంగా నవ్వుతూ ... నవ్వుతూనే, కట్టిన చీరె...రవికె...తొలగించి...అరమరిక లేకుండా దివ్యాంగనలాగా శోభతో...నిలిచిపోయింది...

తారకం...భంగిమను నిర్దేశించి...అదివరకే సిద్ధము చేసుకుని ఉన్న ఈజెల్‌ను ... ఉచితస్థలమున అమర్చుకుని ... రచన ఆరంభించాడు.

—దినములు గడచిపోతూన్నవి. చిత్రము క్రమముగా, మూర్తిమంతమై... చైతన్యభ్రాంతి సలవరచుకుంటూన్నది...

సూర్యుడు ... స్టుడియోలో పని లేనప్పుడు ... సంగీతమును వృద్ధిచేసుకుంటూ, పియానోలో ఆరితేరి...కళాసాంకేతికములను అర్థం చేసుకుని ఆనందించే రస-పాండిత్యం తారకం చిరసహయోగము మూలముగా ఆర్జన చేసుకుని...ఆ విద్ధహీరమణిగా మెరుగులు దేలింది...

‘వెన్నెలకన్నె’...చిత్రము పూర్తి అయిపోయినది. పాద సమీాపతలమున ... అర్ధచంక్రమణమున క్రిక్కిరిసిన...లేతనీలి—మేఘాంతరగలు - వాని అంచున పసిమి కలిసిన మెరుగు చెంగావి రేఖలు... మిగతా అంతా, చిగురుపచ్చ ఈనెలతో...వెన్నెల... ఆకాశనీలిమను బింబించుతూ... వెన్నెలలేకమై ... నిలిచిపోయిన... దివ్యమూర్తి...కైశ్యములో ... చెంపలదగ్గర ... అన్నిరంగుల తళతళతో...అలంకారమాలికలుగా...నక్షత్రములు...

—చివర నగిషీలు అయిపోయిన తరువాత ... తారకం ... మిత్రులనందరినీ విందుకు ఆహ్వానించి, చిత్రమును ప్రదర్శించాడు.

చూసినవారికి...ఉచిత ప్రశంసకు అనువైన శబ్దజాలము లేక...మూర్ప్పడి...అలాగే...అనిమిషులై పోయినారు :

ప్రజాసామాన్యమునకు కూడా చక్షుస్సాఫల్యత కలిగించక తప్పదని...మరీ సన్నిహితులైనవారు మొగమాటపెట్టడం చేత, తారకం... 'వెన్నెలకన్నెను' ఎక్జిబిట్ చేయడానికి అంగీకరించాడు. సౌందర్యమహాలులో ...ప్రదర్శనము మొదలుపెట్టిననాటినుంచీ...ఆ వీధిని మనిషీ మనిషీ మెసలడానికి వీలు లేనంత జనసమ్మర్దమై పోయింది...

వారము...ఇంకోవారము...ఎన్నాళ్లు అక్కడ ఉంచినా... చాలుననేటట్టు లేదు : తారకానికీ సర్వజనాంగీకారమునగాని, ఎక్జిబిషన్...ఆపివేసే మొరటుతనం లేదు...

సూర్యుడు ప్రఖ్యాతి...తారకం ప్రతిష్ఠనుకూడా మించి పోయింది. ప్రసిద్ధ సినిమా తారలకన్న ఇనుమిక్కిలి...ఆమె ఎక్కడకైనా బయలుదేరిందని కాని...వచ్చిందని కాని, తెలియడం వ్యవధానం...జనం విరగబడేవారు. అందుచేత, మునుపటిఅంత స్వేచ్ఛగా విహరించడానికి, తలచినప్పుడల్లా షికారు వెళ్ళడానికైనా, వీలు లేక పోవడం...చాలా చిక్కుగానే ఉన్నది, మొత్తానికి.

సినిమాలోకి తీసుకువెళ్లవలెనని ... ఎందరో పెంపరలాడుతున్నారు : ఆమెకు...తారకం, హుషారీ యివ్వకపోవడం మూలాన ...అవుననీ, కాదనీ, ఇంకా ఏమీ తేలలేదు.

వచ్చి...దాదాపు ఆరునెలలు దాటింది...ఎన్నడూ, యింటివారిని తల్చుకోవడంకాని...విచారపడటంకాని లేదు : మొదటిలో ... తారకానికి కొంచెం బెదురుగానే ఉన్నది ... పోలీసు అధికార సాహాయ్యముతో, సూర్యుడి బంధువులు ఆమెను వెదుకడానికి ప్రయత్నంచేసి, అభాసచేస్తారేమోనని : కాని, వారిజాడలేదు : బహుశః యీ లోకంలో లేదేమో ననే నిర్వేదంతో ఉండి ఉంటారు.

అదివరకు ఎన్నిసార్లో సూర్యుడు అలాగని బెదరించినమాట మనసులో మెసలుతూ ఉండే ఉంటుంది, వాళ్లకు...

కామేశంమీద...ఇంకా మనసు ఉన్నదో, మరచిపోయిందో అని, ఒకటి రెండు సార్లు గాలం విసిరిచూశాడు: మీనుపడ్డది...! అంతటితో, మరీ జాగ్రత్తగా, ఆ పేరైనా తీసుకునిరాకుండా ... ఉన్నాడు: అలాటి సామాన్యుడికి ... సూర్యుడు, ...భార్యఅయిపోయి, కళా- జీవనకోరకములను తుంచివేసుకోవడం, తారకానికి ...సుతరాం యిష్టములేదు. కష్టములన్నీ...వెనుకటిదంతా... ఆమె మరచిపోయి...అలాచేయడమే, అతని అభిమతము —

—మధ్యాహ్నము: వేసవి తీవ్రతవల్ల కొళవేర్ జాలకముల మాటున... తాపోపశమనం చేసుకుంటూ...తారకం ... సూర్యుడు, కూర్చుని ఉన్నారు. క్రమశః అతని కునికిపాట్లు...నిద్దురలోకిపోయినవి. ఆమె...ఏదో ఆలోచించుకుంటూ...కనుమూయలేదు...

ముత్తువచ్చి...ఎవరో వచ్చారని చెప్పాడు. తారకం కోసమే అయి ఉంటుంది, కాని నిద్రాభంగం చేయవలసినంత మునిగిపోయే పని ఏముంటుంది...? ఈలోపల...ఆ వచ్చిన పెద్దమనిషితో...ఎవరో ఎరుగున్నవాడే అయిఉంటాడుకదా...తాను బాతాఖానీ వేస్తూంటే...తారకం, మేలుకున్న తరువాత, వస్తాడు. సరే, కూర్చోమని .. చెప్పమని, ముత్తును పంపివేసి...అద్దందగ్గర ముంగురులు సవరించుకుని, కుంకుమ దిద్దుకుని...తాంబూల రాగవేల్లితమును పైటకొంగుతో, అంగుళివారను తుడుచుకుని...హాలులోకి...వచ్చి...ఆ వచ్చినది ఎవరో అని...అతడు, తిరిగి చూడగానే...పోల్చుకున్నది. కామేశం!

చూసిన వెంటనే... నవనిధులూ హస్తగతమైన కృపణుని ఉహాదానందము... ఆమెలో ఉబికి పోయింది. కామేశం... తన కోసం... వెదుక్కుంటూ వచ్చాడు... తనవాడు...

చేతులు జాచుకొని... అతని కౌగిలిలోపోయి వాాలే ఉద్వేగంతో...సమీపించుతున్నది ; కాని, అతనిముఖంలో, ఆనందమేమీ గోచరించడం లేదు... పైగా ఎంతో బాధపడి... ఇంకా యాతనలో నలిసి పోతూన్న... ఆర్తి... గూడుకట్టుకుని ఉన్నది...

'నిలు... నన్ను ముట్టుకోవద్దు.'

శిలామూర్తియై... నిలువమన్నచోట, నిలువ పడిపోయింది! ఎందుకు అంత కోపం...?

'నీవు- చేసినపనికి సంతోషించాను. నాకు చాలా బాగా బుద్ధిచెప్పావు...! ఇంతకూ నిన్ననడమెందుకు- మీజాతినైజం ఎక్కడకు పోతుంది...'

'కామేశం... !'

'నీనోటి వెంటబడి...నాపేరుకూడా నరకంలో కూలిపోతుంది: ఇన్ని ఊహాలున్నదానవు...అదిఅంతా అభినయమేనా...?మీవాళ్ళు, పాపం, కష్టపెట్టారూ: నీకు, సానిలాగా నికృష్టజీవనంచేయడం ఇష్టంలేదూ:—నేను, రక్షించాలీ...నన్ను తప్ప ఇంకొకరిని కన్నెత్తిచూడవూ...ఎన్ని నాలుకలున్నాయి...నీకు ?'

'అన్యాయపుమాట లాడకు, కామేశం—నేను అనుభవించినది చాలు...ఏజన్మాన పాపమో...! ఇంకా మనసు నొప్పించకు... నేను...నీదాననే...'

'ఛీ...ఇంకా నోరు ఏలా వస్తూందినీకు. లోకం గుడ్డిదనుకున్నావా...నీవు చేస్తూన్న ఘనకార్యం తెలుసుకోలేదనుకున్నావా?...వెన్నెలకన్నె...ఒహో!'

'ఏమిటీ! నీవు చూశావా...ఆ చిత్రాన్ని...'

'చూచాను...సంతోషించాను...!అందువల్లనే...దేవిగారు... ఈ రాజవైభవంలో ఉన్నట్టు తెలుసుకుని...నజరానా సమర్పించు

కుందామని...వచ్చాను. ఇవిగో...అధికారులను మోసంచేసి...తలి దండ్రుల పరువు మంటచేసి...నిన్ను ఉద్ధరించుదామని దొంగతనం చేసి... ఆఫీసునుంచి ఎత్తుకువచ్చాను! పాదపూజ చేయనీ...ఊహుఁ... అంతటితో తృప్తి తీరుతుందా...మహాశక్తివి... రక్తధారలతో అభి షేకించనిదీ ఊరుకుంటావా?...కాని, ఏం చేయను...నీవు పగుల గొట్టిన హృదయంలోనుంచి...ఇదివరకే నెత్తురంతా ఓడిపోయిందే... అయినా, చూడనీ...ఎక్కడన్నా ఓ చుక్క మిగిలి వున్నదేమో, దానితో సరిపెట్టుకో...'

—సూర్యుడికి ... గాభరాతో వెర్రి ఎత్తిపోయి ... అతన్ని కౌగలించుకుని...కామేశం...కామేశం...అంటూ మాటవినిపించుకో మని బ్రతిమాలుతూన్నది. అతడు...ఆమె స్పర్శతో...వళ్లు అగ్నిహోత్రమైపోయి...మోటగా నెట్టివేసి...ఎకసక్కెముగా-వెడనవ్వుతో...

'నీకు, కరవా...ఒళ్లు యిచ్చినవానికే కౌగిలి కూడా ఇచ్చు కో...! ఎంతసొమ్ముపోసి కొనుక్కున్నాడో...పేదవాడిని...అంతధర నేను భరించలేను.'

మాటలు, బాణాలకన్న పదును తేరినవి. సూర్యుడు, మృగ రాజు పంజాదెబ్బతిన్న లేడిపిల్ల అయి తూలిపోతూ ...

'కామేశం! నేను, ఏ పాపమూ ఎరుగను ... నన్ను నమ్మ వూ... ' అని విలపించింది...

'నిన్ను నమ్మితే...నా కళ్లను నేను నమ్మకపోవాలి... '

'వేరు అర్థంచేసుకోవద్దు. చిత్రరచనకోసం...నేను నగ్నంగా నిలిచినమాట నిజమే - కాని, ఆయన - నన్ను పాపపుచూపులతో ఎన్నడూ చూడలేదు...సామాన్యుడా...దేవుడు... '

'—ఏ దేవుడు?' అని పునః ఉచ్చరించుతూ, తారకం... నిదురకన్నులు తెరిపికి తెచ్చుకుంటూ...అక్కడికి వచ్చాడు:

వారి యిద్దరి వైఖరీ చూసి ప్రశ్నార్థకంగా...ఆతడెవరని...
సూర్యుడువంక, చూపు మళ్ళించాడు!

'ఈతను...కామేశం' అని సూర్యుడు, విధిలేక...గొంతు తెమల్చుకుని అన్నది.

తారకం ముఖంలో, ఆశ్చర్యం...దానికి అంతు లేదు...

'నీవేనా మహానుభావా...నీరాకకు కలవరించిపోతున్నాం...! ఏమమ్మా సూర్యుడూ అంతేకాదూ, నీ మనసు నాకు తెలియదనున్నావేం?...నీవు, అన్నవన్నీ...విన్నానయ్యా. నిన్ను, నిజానికి, ఏం చేసినా పాపములేదు. చిన్నప్పటినుంచీ ఒక ప్రాంతంలో యీడుగా పెరిగారే ఆమె తత్త్వమే తెలుసుకోలేనివాడవు—నీవు ముందుముందు సుఖపెట్టగలవని నమ్మకం ఏలా...? అయినదానికీ కానిదానికీ శంకించే—మీకీడెంచి మేలెంచే ఛాందసం పోనిచ్చావుకాదే?... ఇష్టంవచ్చినట్టు ధిమాకీచేసి బెదరించడానికి... ఆమె ఎవరనుకున్నావు? ...

'ఆమె చెడి పోయిందేం... అయితే ఎందుకు వెదుక్కుంటూ వచ్చావు? నీ మహాత్యాగమును ఆమె ఎదుట పొగడుకొనేందుకా? సమయానికి తోక ఝాడించి... దైవవశాత్తూ నేను కనబడకనే పోతే... ఈమె ఏమై పోయేదో ఎరుగున్నావా? ... నీవు ఉద్ధరించిన దేమిటి? నమ్మించి తీరా వేళకు ముఖం తప్పించిన నీవుకూడా మాటాడాలి—ఇంకా—లజ్జా, అభిమానం లేక!

'ఇంతకూ... నీవు ఎన్ని నిష్ఠురము లాడి... ఆమెను నొప్పించినా... సూర్యుడికి... నీమీదనే మనసు ఉండటం... నీ అదృష్టమనుకో...! చూడు, ఆమె కనులలో ప్రేమ ఏలా కురిసి పోతూన్నదో...

'సామన్యదృష్టిలో అవినీతి అనే అజ్ఞానానికి కళాలోకంలో తావు లేదని... తెలుసుకునేందుకు... సూర్యుడిదగ్గర శుశ్రూష చేయ

వలసి ఉంటుంది... నీవు: ఏమమ్మా... విద్యార్థిని అట్టే దండించ
30 బోకు...

'మీ... లౌకిక భావనలు... నా తపస్సును కూడా చెడగొడుత వేమో... నేను పోతున్నాను. టీ మాట మరచిపోయి... నన్ను వేధించకండి... నేను ఒంటరిగా... తాగే... అలవాటు పోయింది— కాదూ సూర్యుడూ ?...'

తారకం ... తలుపు చాటై వెళ్ళిపోతూన్న కొద్దీ ... వెన్నల కన్న...

—వెన్నలలో మునక వేస్తూన్నాడు కామేశం...

* *
*

* * *

వచ్చీరాని రెక్కలు అల్లార్చడం అప్పుడప్పుడే అలవరచుకుంటూన్న, పసితనానే... తారాసుందరికి దక్కినాను. నాటినుంచీ నా జీవనం... పంజరబద్ధమే అయినా, ఖులాసాగా, స్వాదుఫలహార భోజనలతో... గడచిపోతూవచ్చినది.

అతిలోకమోహిని, తార: ఆమె వాలుగన్నులలోనుంచి, ఒక్కచూపు తళుకుమంటే చాలు... మా రౌతు సుమబాణపరంపర శరవేగాన్ని అతిక్రమించి, కురిసేది.

అనురూపుడైన వరుడు లభించాడు: అతని ఆకారవిశేషమే మమ్మల్ని అందరినీ మోసగించింది; అనుకూలుడు కాలేడేమోనని, ఏలా కలగనగలము ?

ఈడేరిన తరువాత... యుక్తకాలానికి... తార కాపురానికి వెళ్ళింది; సారె సామానుతో... నేనూ, పంజరంతోసహా... ఆమె అత్తవారి యింటికి వెళ్ళాను.

—గదికి ఎదురుగా, సావడిలో... కుడిచేతివసారావైపున... నా పంజరభవనం వేలాడగట్టింది, తార: ప్రతిరోజూ, పొద్దు ఓ మాదిరి పోయినతరువాత... తాంబూలం పళ్ళెమూ, మరచెంబూ పట్టుకుని... వయ్యారంతో నడుస్తూవచ్చి నా దగ్గర ఆగేది. రాత్రిళ్ళు మామూలుగా, ఉప్పాడచీరె కట్టుకునేది ... ఉల్లిపొరలలాటివి. సొమ్ములన్నీ ముద్దుగా అమరించుకుని, నొక్కులు నొక్కులైన ఒత్తు తలకట్టుతో, తీయదనమే అలముకున్న, గుండ్రనిముఖంతో, సంతోషం

తొణికిపోయే  చిరునవ్వుతో...హా - బ్బ !...ఎంత చూడ ముచ్చ
34 టగా ఉండేది ! ముద్దు పెట్టుకుని, నా అభిప్రాయాన్ని వ్యక్తీకరించు దామనుకున్నాను...ఎన్ని సారులో !

నా యోజన గ్రహించినట్టుగా... మా తార... నవ్వుతూ, కోమలాంగుళితో చంచువును పుణికి, నిష్క్రమించి... గదితలుపు గడియ వేసుకునేది.

ఇద్దరూ... వారు ఇద్దరూనూ... ఎంతసేపో నవ్వుకునేవాళ్లు; గుసగుసలతో, ఎన్ని రహస్యాలో చెప్పుకునేవాళ్లు... ఎంతసేపో మేలుకునేవాళ్లు—

తొలిజామున, తలుపు ఓ రెక్క నెమ్మదిగా తీసి వసివాళ్లా డుతూ నిదురకన్నులతో, ఆమె ఈవలికివచ్చి, నన్ను ఆ అరమోడ్పుతోనే పరామర్శించేది. నేను కునికిపాటు విదిలించుకుని... అక్కా అని... పలుకరించేదాన్ని.

—నీళ్లు పోసుకున్నది. నీరు ముమ్మరంగాపోసింది. తొలి చూలుచేత... ఓపలేని, ఓపలేనితనమేమో... భారకించి కదలలేక పోయేది. ఏలాగో, లేనిఓపిక చేసుకుని అయినా... నా దగ్గరకు రాకుండా మాత్రం మానేదికాదు.

కాని, మా ఆనంద సుమమంజరి సౌరభసంవాసితముకాలేదు. దేవకి సప్తమగర్భతుల్యమై పోయినది ఆమె వేకటి! చాలా జబ్బు కూడా చేసింది. ఓ రెక్క కోలుకునేటప్పటికే ఎంతకాలమో పట్టినది. వెనుకటి మిసమిస అంతా మాయమైంది. కొంచెము పాలి పోయి ఎప్పుడూ నీరసంగా ఉండేది. అయినా...ఆ కలువకన్నులు మామూలుమేరకు కటాక్షమాలికలను మెరపించడము మానలేదు.

—కటకటాల తలుపు దగ్గరగా మంచము వేయించుకునేది. జాజిపొదమీదుగా తేలుతూ వచ్చే పవనకిశోరాల హాయిఅంతా... ఆమెను జోకొట్టలేకపోయేది.— ఒకటే కలతనిదుర !...

అయనం మారిపోయింది. తారకు... ఓపిక చేరుకోక పోయినా... కోరికల తరితీపు ముమ్మరించినది. కాని—

ఆ వేళ...

—సగమురాత్రి గడచిపోయింది. అటూ ఇటూ మసలి, ఆమె, పక్కమీదను లేచికూర్చున్నది. తిరిగీ పడుకుని, అంతలో లేచి తిన్నగా నా పంజరంవద్దకు వచ్చింది. నేను... ఉత్సాహముతో కిలారించి, అనువైనంత దరికివచ్చాను.

—జాలిగా... దీనంగా... నావంక చూసింది. ఎంత వేదన భరిస్తూన్నదో... ? కటకట బడగలనుకాని నా అనుతాపం ఏలా ఆమెకు తెలియజేయడం ?

... పడకటింటికి తలుపు తెరుచుకున్నది : అతడు, లోనుంచి తొంగిచూశాడు. ఆవేశంతో, తార... చప్పున...

'వస్తూన్నాను' అన్నది కోవెలగొంతుతో.

'— పిలువలేదు—' అని, తలుపు ఓరన ఆ అరమోము నుంచి జవాబు. తార ఏమీ మాటాడలేదు.

'ఇంకా... మేలుకునే ఉన్నావేం ?' అని లోపలనుంచి...

'నిదురరాలేదు'... అంటూ బయటనుంచి...

'తెచ్చుకుంటేనా ...? నాకు తెలుసునులే నీ వేషాలు...'

—పాపం, ఏమనగలదు .. తార ?

'... కనిపెడితే... భయపడుతాననుకున్నవా ఏం ?'— తల... లోపలికి పోయింది. మరుక్షణంలో అతడు బయటికి వచ్చి... మాపక్కనుంచే... చురచుర చూస్తూ, వెళ్లిపోయినాడు.

తార, కదలక... అలాగే, ఉన్నచోటనే నిలువబడిపోయింది. మొగమెత్తి, కన్నీళ్లజాలుతో, ఎలా... ఎలాగో... చూసింది. ఇక, ఆపలేక... వెక్కివెక్కి ఏడ్చింది, ఎంతసేపో—

'అక్కా... అక్కా — అ...క్కా...'

— సంభాళించుకున్నది: మన్యువేగభరమైన గొంతులో— 'ఇది తగదని... ఇలా చేయడం కూడదని... నీవైనా చెప్పవు కద!' అన్నది.

నిజమే!... చిలుక రాయబారాలు... ప్రణయకలహముల చాటుల్లో... విప్రలంభాలకు, ప్రబంధకాలములో, కొంతవరకూ ఉపకరించినవి. ఇప్పుడు, మా కులమునకు, ఆతాహతు ఏదీ? నేరిపే గురువులేరీ? అయినా, ఇదివరలో మందారమకరంద మాధుర్యముల దేలిన మధుపము... మదనములకు, చేరడం మరగిన తరువాత మళ్లా బాగుపడుతుందని... నాపిచ్చితల్లికి ఏలా చెప్పగలను... ఏమని ఊరడించగలను?

—తలుపు తొలగి పోయింది— తార, పంజరమును, పరాకుగా తడమటంలో. నేను, వెనుక ముందు ఆలోచించకుండా, బయట పడ్డాను. ఆమె నన్ను గమనించనే లేదు. పట్టుకు నేందుకు ప్రయత్నించ లేదు. ఆ స్వేచ్ఛావకాశమును పురస్కరించుకుని... కిటికీదాకా చెంగుతూపోయి... కమ్మీల సందునుంచి, దూసుకున్నాను.

పండువెన్నెల!— క్షుద్రవిహంగాలు తప్ప ఉత్తమజాతు లేవి... సంచరించకూడదనే అనుస్మృతమైన నియమాన్ని అప్పుడు లక్ష్యం చేస్తానా? రెక్కలున్నా... రెక్కలు కట్టుకుని పోతూ న్నట్టుగా సాగుతూన్న నాకు... అతడు, ఎంత దూరమైతేనేమి... కలుసుకున్నాను.

—అప్పటికి అప్పుడే విలాసభవనం మెట్లు నదురూ బెదురూ లేకుండా... వెనుక తిరిగిఅయినా చూడకుండా... ఎక్కుతున్నాడు. నేను, రోడ్డుకు ఈవలివైపున... ఎదురుగా, దీపస్తంభము అడ్డకమ్మీమీద వాలాను. తలుపు తట్టినాడు. చాలా నెమ్మదిగా నాకు వినిపించ లేదు కాని... ఏదో పేరున పిలిచాడు, రెండుమూడు

సార్లు. తలుపు... తనంతటగా... తెరుచుకున్నది; లోపలికి అడుగు వేశాడు,... గడియ పడ్డది.

ఆలాగే... అక్కడే ఆలోచిస్తూ కూర్చున్నాను, ఇంటివైపు చూస్తూ. లోపలకు ఏలాగ చేరుకోవడం? చుట్టు తిరిగితే ఎక్కడన్నా దోవ కనబడుతుందేమో?

... ఎటూ పాలుబోక ఉండగా— నాకు ఎదుర... మేడ మీద గదిలో వెన్నెల పడినట్లు దీపం వెలిగింది. రెండు కిటికీలకూ పై వరుస రెక్కలు తీసే ఉన్నవి.

—సద్దు చేయకుండా... ఊరికే అలా, అ... లా... రెక్కలు అనుకుంటూ తేలిపోయి, ఎడమ కిటికీపై నున్న ఆచ్ఛాదనను ఆధారము చేసుకుని... లోపలగా సందు చిక్కించుకుని... కూర్చున్నాను... చూస్తూ.

తలవైపు, దోమ తెర జారవిడిచి ఉన్నది... పందిరిమంచమునకు: ఆతడు, ఎదటివైపున నిలుచుని, పడుకుని ఉన్న ఆ...ఆ-మెను మీగాళ్లు కదిలిస్తూ... 'రాజా— రా... జా' అని పలుకరిస్తూ, మేల్కొలుపుతున్నాడు.

ఒక మారు, కలవరింతగా మూలిగి... పక్కకు ఒత్తిగిలి... మళ్ళీ నిద్రనే అభినయించింది. ఓ నిమిషము చూసి, బలవంతాన లేవదీసి కూర్చో బెట్టాడు. నిద్ర మత్తులో లాగ... తూలిపడబోతే, కౌగిట నలముకుని, సోఫామీదకు పోయి పడ్డాడు. 'ఏమిటి... ఈనిద్ర?...' అని, తన భుజంమీదకు వాలిన ఆమె ముఖం వంక చూస్తూ, మునివేలితో పెదవిని మీటుతూ...లాలనగా అడిగాడు.

అప్పుడే మేల్కొంచినట్టుగా... కళ్ళు, అర విరియించి, ఒక మారు ఆతనివంక... ఆ చూపుతోనే గది అంతా కలయవేసి...

పై పెదవికి అంగుళులు చాటుచేసి నాజూకుగా ఆవలించి... ఆతని ఒడిలో తనతల అమరేటట్టుగా జరిగి... ఒరిగింది.

పడుచు ... చాల అందంగా ఉన్నది! అవును... నాగు పాము...చక్కగా ఉండదూ...? ఆడుపులి...?

—ఆమె చెక్కిలి నిమురుతూ రెండవ చేతితో... పాణిని అందుకుని తన మెడమీదుగా లాక్కో బోయినాడు... కొంచెం ముందుకు వంగి. ఆమె, ఆ విలాసాన్ని చెరిపివేసి, చికాకుతో... కోపంగా... 'ఊహూఁ... మోటతనం'... అని విదలించింది.

మా ప్రబుద్ధుడు, తన పాండిత్యమంతా వినియోగించి ఆమెను కిలకిలలాడించాలని చూశాడు. కాని.. ఆ హుషారీ - సరసాలు... సాంత్వనోపాయములు ... వ్యర్థమౌతూన్నవి; అంత చులకనగా కన్నులు తెరచి కటాక్షించడము...రసభంగము కాదూ... ?

—లేచి...అటూ ఇటూ పచారుచేశాడు! ఆకుమడుపులు... ఆ పరధ్యానంలోనే అందుకుని...గోరుతో త్రుంచి...మీదకు విసిరాడు. ఫోను మొదలువేసి, చప్పున ఆపి...చలాకీగా పన్నీరుబుడ్డి అందుకుని, ఒక్క అంగలో సోఫాదగ్గరకు వెళ్ళి...ఆమె నులిపైట చెరగు ఒంటికి అంటుకుపోయే అంత ఒత్తుగా చిలకరించాడు. ఏమీ పని చేయలేదు...పన్నీటిజల్లు: ఆమె ఇంకా మేలుకొందలచినట్లు లేదు.

ఉత్తరీయం అందుకుని, ముందుకు నాలుగు అడుగులు వేసి... ఒక నిమిషం ప్రతిమలాగు నిలువబడి... 'నేను... వెళుతున్నాను' అని, కొంచెం దూకుడుగా తలుపుదాకాపోయి...గడియచప్పుడు చేస్తూ, మళ్లా నిలువబడినాడు. తిరిగి...సమీపించి...జఘనోపరిని మృదువుగా ... కరపరామర్శనము చేస్తూ 'నేను ... వెళ్ళిపోనా...' అని జాలిగా అడిగాడు: ఆమె... అరమెలకువలాగా... మసలి... ఊరుకున్నది. బలవంతాన, చోటుచేసుకుని, ఆమె దగ్గర... సోఫాలో... ఇరికాడు. చెక్కిలి నిమురుతూ... 'ఎందు

కూ— అంత కోపం?' అన్నాడు. అవశనుగా తలుస్తూ... లోగొన బోయినాడు. ఆమె... కస్సుమని లేచి ఆతన్ని, మోటుగా తోసి... ఎదురై ఒరగిలి కూర్చుని... 'ఏమిటి... ఆగడం!' అని గర్జించింది.

'హా... మ్మ! మేలుకున్నా వన్నమాటేనా...' అని ఉబలాటంతో దగ్గరకు జరిగి... మీద చేయివేయ' బోయినాడు. 'చాల్లెండి... ఇక చాలించండి... మీసరసాలు...' అని కసిరింది. ఆతడు... వినిపించుకోనట్లు, ప్రణయోత్సాహమును తగ్గించుకోలేదు.

'దూరంగా కూర్చోండి.'

'ఎందుకేం?'

'నన్ను ముట్టుకోనన్నూ.'

'ఆఁ... నీ యిష్టమే...'

'కాదు!... అన్నిటికీ... మీయిష్టమే...! ఇక్కడ దాచబెట్టారు—! అర్ధరాత్రి... అంకమ్మ శివాలు—! మళ్లీ బెదిరింపులు కూడాను: వెళ్తే వెళ్లండి. కడుపు నిండుతూంది... మిమ్మల్ని చూస్తూకూర్చుంటే!... చిక్కకుండా ఓ చుక్క గంజీ... మొగం వాయకుండా మొగుడూ... అని మా అవ్వ అనేది...'

'సరే... వెళుతాను' అని లేవబోయినాడు.

'వల్లకాదు... వీరా యిష్టమేనా...' అంటూ చేతులు ఆతని మెడకు పెనవేసి, ఒక్క నిమిషం హాయి అనిపించింది. అంతలో వదలి... దూరంగా జరిగి, అర్ధరాద్రికృతితో...

'...అన్నీ అబద్ధాలే'

'ఏమీ?'

'మరి...ఏవీ...'

'ఓం… ఇందుకా… అలుక… ? తయారైన మరు నిమి
40 షంలో… తీసుకురాకుండా ఉంటానా… '

'అవును… ఎన్నాళ్లకు అయినా తయారుకావు…! నే బ్రతికి ఉండగా… కావు! కమసాలివాళ్లందరూ గంగలో కలిసిపోయి నారా… ? నాకు… చేయించడానికి వచ్చేటప్పటికి మీ చేతులు…'

'నామాట… నమ్మవూ! నిజంగానే… '

'నాతో… మాటాడమాకండి… '

కులనాయకుడు…కాళ్లంటి బ్రతిమాలినాడు, అనుగ్రహించమని. సత్యభామ తాపునకు శతగుణమైన పాదప్రహారాన్ని… మహాప్రసాదముగా పరిగ్రహించాడు. కాని…

—ఆవేశంతో…వెర్రివానిలాగానిలుచుని…పరవళ్లుపోయి…

'…చూచుకో—రాజా ! నీవు మోయలేనన్ని సొమ్ములు… ఇప్పుడే తెస్తాను…' ఇలా శపథముగా కలువరించాడు.

ఆ…మె,మందహాసముతో…ఒట్టు…అని వేలు వయారించింది.

సంజీవి పర్వతంకోసం బయలుదేరిన హనమానసూనుని లాగా… మా నాయకుడు… ఒకటేగంతు, పరుగు. నేను, ఇక అక్కడ నిలువకుండా… ఎగిరి, పూర్వమార్గాన్నే… ఆతనికన్న ముందుగా యింట్లోకి వచ్చేశాను. అంతా నిశ్శబ్దముగా ఉన్నది. తార… నిద్రలో ఏమో… కదలకుండా పడుకున్నది!

తోచక, పంజరం కోపుమీదవాలి కూర్చున్నాను; తారను చూచినకొద్దీ శోకం అతివేల మౌతూన్నది. కాని కడుపులో వేదనను కన్నీటిధారలలో చల్లార్చుకోవడానికి…మేమునోచుకొనలేదుకదూ!…

— అంతలో…

తలుపు ధడాలున తెరుచుకుని… ఆతడు లోపలికి వచ్చాడు. నాకు, పంచప్రాణాలూ లేచిపోయినవి. వికృతమైపోయిన వదనము చూడగానే. కూర్చున్నచోటనే… ఒదిగి పోయినాను.

... యకాయకిని గదిలోకి వెళ్ళిపోయినాడు. అవీ-ఇవీ విరజిమ్ముతూన్న చప్పుడు గలభాగా అయినది. బయటకు ఉరికి... మంచం దగ్గరకు వెళ్ళి, తారను... నొచ్చుకునేటట్టుగా... కదలించి...

'తాళాలు... ఏవీ?' అని... అదరిపాటుగా...అడిగినాడు.

'ఏమో...' అన్నది నిద్రమబ్బులో, తార...

దిండుతోకూడా...తల పక్కకు దొర్లించి తాళాలు తీసుకుని మళ్ళాలోపలకు వెళ్ళిపోయినాడు.

—ఇనుప మందసము చప్పుడు! ...తార లేచి కూర్చున్నది. నేను...సద్దుచేయకుండా వెళ్ళి సమీపాన కిటికీలో వాలాను. నా తల నిమురుతూ...ఎంతో జాలిగా ..అధీరముగా ..కడుపు తరుక్కునిపోయేలాగు...చూసింది ; ఆ చిన్నారి కనుదామరలు సద్యస్తరంగితనయాగరాలయినవి.

అతడు పునః...వచ్చేశాడు. చేతిలో ఆభరణపేటిక ఉన్నది. తారనుచూసి, ఉలికిపడి అడుగు ముందుకువేయకుండా ఆగిపోయి...

'మెలకువ...వచ్చిందేం' అని సామర్షంగా, వెకిలిగా... నీచపుచూపుతో అన్నాడు.

తార...ఏమీ అనకుండా...అడుగడుగుకూ వేపథువౌతూ సమీపించి తలవంచుకుని నిలుచున్నది.

'వెళుతున్నాను...'

ఆమె...మీద చెయివేయబోయింది. ఏమో అనబోయింది. అంతే...

ఆఁ...ఆఁ...ఏమనను! ...ఆ...ఉద్దండుడు చేతిలోని భరణితో...హా...బ్బ...!

—అంతే, తార... ఆతనిపాదముల దగ్గరే... పతిచరణమూలముననే... మొదలంట కూలిపోయింది.

నేను... గగ్గోలు అయిపోయి..., అలికిడి చేయడం... నాస్థితి .. ఆ ధర్మాత్ముని కంటపడి... తాళపు చేతులు నామీదకు విసిరాడు. కాలూ, రెక్కా విరిగి... జటాయువునై పోయినాను కసిదీరా ముద్దగా నలిపేసి... మెడనులుమకుండా... గిరవాటు వేసి... తిరిగిచూడకుండా వెళ్లిపోయినాడు.

మెదలలేక .. పడినచోటనేఉండి... తారవంక చూస్తూ న్నాను. కదలిక లేదు. ఎంతసేపో .. మరి... ఎంతసేపో . లేస్తుందేమోనని చూశాను. ఊహు...

ఓక్షణానికి... మనసు నిలుపలేక... బలవంతాన ఒక రెక్కమీద దేకి... సమీపించి, ఆ మెభుజం మీదకు పాకి, రెక్కతో మెల్లన విసిరాను. చంచువుతో చెక్కిలి గీరాను. కాని...

—తార... ఇక లేదు. మా కన్నతల్లి... ఈలోకములో... ఇక నన్ను పలుకరించదు. పతిప్రాణఅయిన కులవధువుకు... నాధుడు మన్నించనినాడు... జీవము నిలుపుకొనే అవసరము... పని . ఏమున్నదీ ?—

—ప్రాణములమీద తీపి...తీయని పండ్లను ఆరగించి అల వరచుకున్నది... గృహ మార్జాలికి అందక తప్పించుకుని... బ్రతు కుతూ వచ్చినది, ఇంతవరకూ.. మా చిట్టితల్లి... తారకోసమే కాదూ...

ఇక... నాకు విముక్తి ఎన్నటికో. 'మ్యావ్' ప్రత్యభిజ్ఞతో నా మోక్షకారకులు ఏనిమిషాన దర్శనమిచ్చి, నన్ను మాతార దగ్గరకు చేర్చుతారో...! ఆ ధ్యానమే, ఇక ! అతడు... ఊం... ఆ పాపకర్ముని జోలి... ఎవరికి కావాలి ?

* * *

* * *

'హాలో... మోహన్ !...'

తలవని తలంపుగా... మిత్రుని అమితబలవంతంమూలాన... పనితొందరలన్నీ తెముల్చుకుని మదరాసు బయలుదేరడం... కృత్యాద్యవస్థ అయింది. "పరంజ్యోతి" దసరా సంచికను సర్వాంగ సుందరంగా.. శాయశక్తులూ వినియోగించి తయారుచేసిన... మానసిక-బడలికలోనే, ఆదరబాదర... రవంత అయినా వ్యవధానం లేకుండా ప్రయాణం కావడం... కొంచెం విసుగుగానే ఉన్నది, శాస్త్రికి. కాని, జీవికాజీవి .. మోహన్ తప్పదని పట్టుపట్టడంచేత ... అతని ఉత్సాహానికి విఘాతం కలిగించినట్లవుతుందేమో, అతడు వెళ్ళుతూన్నది... ప్రియా సందర్భమునకు కదా అని ... ఒప్పుకోకతప్పింది కాదు.

ఎనిమిదిగంటలు మ్రోగుతూండగా... మెయిల్ సెంట్రలుకు వచ్చి ఆగింది. శాస్త్రి, చల్లగాలి హాయికి... నడనడంగా కూర్చుంటూ మెలకువగా ఉండకపోవడంచేత... మోహన్ దిగిపోయినతరువాత కాని, కనులు తెరవలేదు...

అప్పటికప్పుడే అతడు... ఎదుర్కొనడానికి వచ్చిన... మిత్రులతో... సంభాషణం చేస్తూ ఉన్నాడు. శాస్త్రిసమీపించడం చూసి నిలుచున్నవా రందరూ కొంచెంఎడమై... స్వాగత-పరిచయ సూచనలు కనబరిచారు. మోహన్ తన సరసను శాస్త్రిని నిలుపుకొని ... ఎరుకపరచాడు—

'వీరు... డాక్టరు శర్మగారు.—నా ఆప్త మిత్రుడు... శాస్త్రి,

పరస్పరాభివందన లాంఛనములైన తరువాత, శర్మగారు... తన భార్యను... కుమార్తె నిర్మలనూ నిర్దేశించి, పరిచయము చేసినాడు.

... స్త్రీలు ఇద్దరూ, నవనాగరిక నేపథ్యంలో ఉన్నారు. శాస్త్రి, శ్రోత్రియ తత్త్వమునకు... ఈవిలాసములూ, నదరూ-బెదురూలేని-తనం, నిర్భయంగా, పురుషులతో సమానప్రతిపత్తి కలిపించుకుని మెలగే చనవూ, పూసుకుని రావడం... ఎబ్బెట్టుగా కనిపించినవి. లోకవృత్తమును ఎరిగినవాడైనా... సర్వసమర్థుడైన పత్రికాకారుడైనా... పండితుడైనా... పూర్వాచారాభిమానితుడు కావడంచేత,...మామూలు బ్రాహ్మణ సంసారులలో... కుటుంబ స్త్రీలలో... ఈవేష భాషలు గోచరించడం వింతగా కనిపించి కలవర పరచినవి. కాని... అదీగాక, ఇంకో చిక్కు వచ్చింది. వాళ్లకు పునరభివాదము ఏవిధంగా చేయడం— కరస్పర్శనమా... లేక చేతులు జోడించడమా...? ఈవిభ్రమం... తల్లి, కూతురు గమనించినట్టున్నారు— తమకు తామే చిరునవ్వుతో... చేతులు అందించి... ఆతని స్పర్శ... అలవాటు లేని ఆపోశనమని గ్రహించి, కళ్లలో కొంటె తనం మెరయించారు.

'వీరే... కాదూ, "పరంజ్యోతి" ఎడిటరు...?' ... అని ప్రశ్నించింది శర్మగారి భార్య.

'అవును. శాస్త్రి... నీ మేగజైన్ అంటే వీరికి చాలా యిష్టం...' అని మోహాను వివరించాడు.

'యస్... యస్. నిర్మలకు... ఆ పత్రిక కనబడితే... నిద్రాహారాలు కూడా మరచిపోతుంది... సాంతం అయేదాకా...' అని శర్మగారు.

'ఏమండీ... దసరాసంచిక తయారయిందా ?' అంటూ నిర్మల ఉత్సాహంగా అడిగింది :

'ఆఁ... పంపించాము కూడానే, మీకు ఇవాళ అందుతుంది... '

'కాను, రేపు: నెల్లూరువెళ్ళి... ఇక్కడకు తిరిగి వస్తుంది. మీ వెంట కాపీలు ఏమీ తీసుకురాలేదూ... ?'

'ఉండవచ్చును. సాయంకాలము తప్పక తీసుకువస్తాను'

'అదేమిటి... మీరు, మా అతిథులు. ఎక్కడకూ, వేరే మరోచోటికి వెళ్ళడానికి వీలులేదు...' అని శర్మగారు బలవంతం చేశారు. ఆయనభార్య... నిర్మలాకూడా మొగమాట పరచారు. కాని, శాస్త్రి... తప్పించుకుని... సాయంకాలము టీకి వస్తానని ఒప్పుకుని... యూనివర్సిటీ క్లబ్బులో ఉన్న ఓ మిత్రునిదగ్గర విడియడమునకు వెళ్ళిపోయినాడు. మోహన్, శర్మగారితో కలసి... ఉండిపోయినాడు.

—మూడుసార్లర కావచ్చింది. నిమిషాలు గడచినకొద్దీశాస్త్రికి వాళ్ళయింటికి వెళ్ళడమూ, మానడమూ అనే విచికిత్స జాస్తీ అయింది. తల్లీ కూతురిని చూసినప్పటినుంచి... అకారణమాత్సర్యం ఆవహించింది. వారివాలకం...చిరాకు తెప్పిస్తూన్నది— తలచుకున్నప్పుడల్లా. పోనీ, పద్ధెనిమిదిఏళ్ల...వయసుగత్తె...అనర్సుకాదూ చదువుతూన్నదని, శర్మగారు అన్నది...ఆమె ఎన్ని వేషములు వేసినా ఫరవాలేదు. కానిఆతల్లి, శర్మగారిభార్య..ఏ ముప్ఫైఅయిదుఅయినా వయసు ఉంటుందికదా...పసిదానిలాగా...ఇంకా అంతకన్నా ఎక్కువగా... ఆ సింగారమేమిటి ?...ఆలాటివాళ్ళయింటికి...వెళ్ళకూడదు. పత్రిక ఎవరిచేతనన్నా, పంపించవచ్చును. మోహన్ వస్తాడేమో, ఆతనితో ఏదో సాకుచెప్పి...ఏలాగో తప్పించుకుంటే...

కాని...ఉదయం...శర్మగారిభార్య, నిర్మల పిలిచినప్పుడు... మానందాల్చి, అహ్వానానికి అర్థాంగీకార సూచన కలిగించి... వెళ్లడము మానివేయడం, మర్యాదాహీనము కాదూ ?... ఏమని భావిస్తారో... ? తన కేమి కాని... మోహానుని గౌరవం కాపాడటం కోసం... మాట దక్కించడానికైనా... వెళ్ళకతప్పదు... ఈ ఒక్క మారు. మళ్ళా, రమ్మని పిలిస్తే...నిష్కర్షగా చెప్పి వేయవచ్చును. ఆలాగని మనసు దిటవు పరచుకున్నాడు.

జాగ్రత్తగా వేషధారణంచేసి, సరిగా వేళకు... ఇలియట్సు రోడ్డులో, వారి భవనం కనుక్కొని వెళ్ళాడు. అందరూ, చాలా గౌరవించి, ఆహ్వానించారు... ఆప్యాయనంగా :

... ఇంతకు ముందుసారి చూసిన దాని కన్నా ఎక్కువ అందంగా కనిపించింది, నిర్మల. ముఖమల్ వారు కోడు వేసుకున్నది. లేత గోధుమరంగు ముద్దకుంకుమపూవుఅంచు ఆగ్రాచీర... గుజరాతీ, పైఠనీ కత్తిరింపు అర్ధకంచుకం. ముత్యాల ప్రాలంబికం. తలలో, ఒరిగి వదూలుగా జారిపోతూ దొంతరమల్లెల కత్తెరదండ. కలువకన్నులలోనూ, పాలబుగ్గలలోనూ, తారుణ్యం మిసమిసలు తేలుతూన్నది: ఆ మనోహరాకృతి చూసేసరికి అదివరకు ఉన్న సంకోచం... కలిగిన ఆగ్రహం... అంతా మాయం చేసుకున్నాడు శాస్త్రి.

ప్రథమ సల్లాపముల వంతులు తీర్చుకున్న తరువాత...టీ పుచ్చుకునేందుకు...ఆసీనులైనారు. శాస్త్రి నిర్మల ప్రక్కను... మోహన్ కూడా బలవంతము చేయడంచేత...కూర్చోక తప్పింది కాదు. ఆ అమ్మాయి.. తగని సరదాతో..."పరంజ్యోతి" ని తిరగవేస్తూ, పేజీ పేజీకి, చదివి...చూసి...మురిసి పోతూ, ప్రశ్నల వర్షం కురిపిస్తూ—

శాస్త్రికి... పదార్థములు ఏవీ నోటపెట్టుకునేందుకు మనస్కరించలేదు. అందిచ్చే పరిచారకుడా ఏ వర్ణమువాడో పోల్చు

కు నేందుకు వీలులేదు. ఇక అమర్చినవా... ఏమి కలిసినవో... వింతరుచులవో, పాశ్చాత్య విధానపాక క్రమమును వ్యక్తము చేస్తున్నవి. అందువల్ల... టీతో సరిపెట్టుకుని, ఆ భాస చేయకుండా ఏలాగో మొక్కు తీర్చుకుని, లేచాడు...

బీచికి షికారువెళ్లి తిరిగివచ్చాడు... వారందరితో. భోజనానికి ఉండిపోవలసినదని ... నిర్మల మారాము చేసినా... వీలు లేదని చెప్పేసి ... తప్పించుకునే ... ప్రయత్నంలో ఉండగా ... మరునాడు, మళ్లా ఆ వేళకు, టీకి రాక తప్పదని శర్మగారిభార్య, నిలవేసి... ఒప్పించింది.

' రాను... ఋమ్మాటికీ రాను ... ' అనే మాటలు నాలుక చివరదాకా వచ్చినవి. కాని, వెంటనే తమాయించుకున్నాడు. ఆడవాళ్లతో అంత కఠినంగా మాట్లాడవచ్చునా? వారివాక్కే ఎంతో కోమలంగా ఉంటుంది: అందులో ఆహ్వానించేది... ఇటువంటివారైనప్పుడు... అన్యథా ఉత్తరం యిస్తే... వట్టిమోటుతనంగా ఉండదూ? సరే... రేపటిమాట అప్పుడు... అందాకా వచ్చినతరువాత చూసుకోవచ్చును ... అని, ఏమీ తోణకకుండా అప్పటికి వారినివీడ్కొన్నాడు:

మరునాడు... ఉదయం పదిగంటలకు శర్మగారి కార్‌లో, మోహన్, క్లబ్బుకువచ్చాడు. కాబోయే పెండ్లికొడుకు, ... నిర్మల లాటి చక్కనిచుక్కను, సరసురాలిని సహధర్మచారిణిగా చేసుకోబోయే భాగ్యశాలి... అందగాడు, అందమును రెట్టించే అలంకరణ మర్యాదలెరిగిన నాగరకుడు... వృద్ధిలోకివస్తూన్న లాయరు... తీయని కోరికలు నిలువెల్లా కమ్ముకునిపోయినట్లున్న ఆతన్ని చూడగానే... శాస్త్రికి... వాత్సల్యం ఇనుమడించింది. మనసులో అర్థముకాని... నిరూపించలేని... ఆలోచనలు... కొనలుసాగినవి ..

ఉన్నగంటసేపూ ... మోహన్ ... నిర్మలనుగూర్చి వంది మాగధ ప్రశంసలు పరవళ్లుకొట్టించి ... ఆమె ఆంధ్రభాషాపాండి

త్యాన్నీ ...రసజ్ఞతనూ... కవితాధోరణినీ... ఒకటే మెచ్చుకుని... శాస్త్రితో, సాయంకాలము టీకి రావలసిన బాధ్యత ఉన్నదని మరో మారు జ్ఞాపకం చేసి... నిష్క్రమించాడు...

ఆతని వెంటనే... ఆతడు తీసిన దోవలనే... శాస్త్రిమనసు, నిర్మల చాయలకు పోయింది. సనాతనిష్ఠామేఘమాలికలు... శరచ్చంద్రికాపరిసారంలో ... విరిసి తప్పుకుని పోయినవి. నిర్మల... ఎంత అందగత్తె... ఎంత తెలివితేటలున్నది... ఎంత నేర్పరి...! మోహన్... తగినవాడే అయినా... ఆమెకు అనురూపుడా...? గృహలక్ష్మిగా... వరించేభాగ్యం... ఆ, సామాన్య లౌకికునికి...?... ఉహుఁ...! మిత్రుని విషయంలో అపచారం చేయడంకాదూ, ఇలా భావించడం...? తాను వచ్చినది, మోహన్‌కు ఆసలాగా ఉండి ఆ నూతన పరిణయమునకు, చేతనైన ఔపచారిక దోహద విధానముల మెలకువలు తీర్చడానికా... లేక, వంచనచేయడానికా ?... ఇది తగనపని. కాని... నిర్మల...

ఆరాటం తీరలేదు. కాని, కాలం, ఎంతవారికైనాసరే మన్నించి... ఆగిపోతుందా...? నాలుగుగంటలు కావస్తూండగానే... శాస్త్రి... పునః ఇలియట్సురోడ్డు ప్రాంతమున అవతరించాడు...

... ఎదురుగా ఎవరూ రాలేదు. హాలులో కూడా ఎవరూ కనబడలేదు. అర్థంకాక... అందరూ ఎక్కడకు వెళ్లినారో ఏమో అనుకుంటూ... పక్కనున్న ద్వారం తెర ఒత్తిగించాడు.

... యీజీఛైర్‌లో నిర్మల విలాసంగా వాలి, “ పరంజ్యోతి ” తదేక ధ్యానంతో చూస్తూన్నది. గదిలో గోడల అంచుగా... ప్రెస్సుడుసీడర్ స్ట్రెచింగ్ బుక్ కేసులు పుస్తకాలతో క్రిక్కిరిసిపోయి... అమరి ఉన్నవి. పెద్ద కిటికీ ఇరుపక్కలా, చలువ రాతి పెడస్టల్సుమీద... శిల్పచిత్రములున్నవి. క్రింద... అడుగుడిగి

పోయేటంత పట్టు మెత్తదనంతో పారశీ తివాచీ పరచిఉన్నది. 
మధ్యగా... రోజినావ్ మాడేల్ యేజోరా... సోఫాలూ... ముత్తెపుచిప్ప పరచిన మహాగని సెంటర్ పీస్. కుడివైపున,... ఓక్ రాయల్... వర్కు టేబుల్. తెరలకు ఫ్లెమిష్ వయోలా క్రేప్ అండ్ గోల్డు అద్దకములూ. అప్ హోల్ స్టరీ... అలంకారములూ... పరాసువారి యిళ్ళను మించిపోయి ఉన్నవి.

నిర్మల పడక కుర్చీలోంచి లేచి, పుస్తకం విడిచి... సోఫా వద్దకువచ్చి... మూలకు ఓరగిలి కూర్చుని శాస్త్రినికూడా సరసను ఆసీనుణ్ణి చేసింది...

'అంతా... 'వైట్ వే' కు... వెళ్లారు. వచ్చే వేళ అయింది... '—అన్నది, సంభాషణకు ఉపక్రమించి.

'అట్లనా. మిమ్మల్ని డిస్టర్బ్ చేయడం... '

'...' కోర్స్ నాట్. మీరుయింకా రాలేదేమా అనుకుంటూ న్నాను. తనివి తీరక 'పరంజ్యోతి' మళ్ళా చదువుతున్నాను : ఎంత చక్కని గెటప్ యిస్తారండీ... చాలాఖర్చుఅవుతూండాలి...?'

'అవును. ఏమైనా ... ఆదర్శపాయంగా, ఉత్తమరీతిని తయారు చేయవలెనని...పట్టుదల, నాకు. ఖర్చుకు లక్ష్యము చేయ డం లేదు :'

'ఆహాఁ. ప్రస్తుతం ... నేనెరుగున్నంతవరకూ, యిటువంటిది మరొకటిలేదు. అంతా ఇంగ్లీషుపద్ధతిని ...ఎంతసీట్ గాఉన్నదండీ... లేటెస్ట్ ! అదీగాక...కథలూ పద్యాలూ... మాత్రమే ప్రచురించడం, నిజంగా...అద్భుతంగా ఉన్నది. లేకపోతే... శాసనాలూ...వితండాలు...ఎవరికి కావాలి '

'అవును...ఈకాలమునకు ...ఇలాటిపత్రిక అవసరమనే... తలపెట్టాను. ఏడాదిగడచింది...దైవకృపను '

'తప్పకుండా...నిలిచితీరుతుంది. సక్సీడ్ అవాలి...నో డౌట్'

'...మీబోటివారి సహాయం కూడా...కాస్త...'

'ఏవిధంగా...'

'ఏమన్నా కథలు...పద్యాలు...'

'నేనేమీ వ్రాయనే...'

'వ్రాయరూ...? ఉదయమేకదా మోహన్ చెప్పాడు...మీ విషయమంతా...'

'ఏమని...? ఆయనమాటలకు ఏంలెండి'

'అలాకాదు. మీరు దయఉంచి...వచ్చేసంచికకు...'

'అంతపెద్దమాట ఎందుకూ! నో...శాస్త్రిజీ! అప్పుడప్పుడు ఏవేవో పిచ్చిపిచ్చిపద్యాలూ పాటలూ... కథలూ వ్రాస్తూంటానను కోండి. కాని, ఏవీ ప్రకటనార్హములు కావు...'

'నేను...చూడవచ్చునా?'

'...రేపు టీకివచ్చినప్పుడు...చూద్దురుకాని. ఏంప్రయోజనం? ఒక్కటైనా మీకుపనికివస్తుందని తోచదు...'

'చూస్తానుకాదూ... విలువనుగుర్తించే భాగ్యావకాశం... నాకు వదిలివేయాలి...'

'అయితే...ఏమండీ ... మన "పరంజ్యోతి" లో ...వసంత కుమార...అని, పద్యాలూ, కథలూ వ్రాస్తూంటాడే ... హూ యిజ్ హి ?'

'ఎందుకూ...మీకు?'

'ఆయన రచనలంటే... నాకు తగనిప్రీతి. అంతచక్కగా ఇంకొకరు వ్రాయలేరన్నంత అభిమానం...నాపద్యాలన్నిటికీ భావావలంబనం... ఇన్స్పిరేషన్ ... ఆయన...రచనలే...!'

... ఆ ప్రశ్న నిర్మల వేస్తుందని, శాస్త్రి కలగన్నాడా... వినగానే చలించక ఏలా ఉంటాడు...? ధీరుడు కనుక మనోగత భావా

లను గోపనం చేసుకోగలిగినా... ఆమీాది...నిర్మల వివరణం... 
వ్యాఖ్య... మరీ తలకిందులు చేసింది. నిరుత్తరుడైనాడు. ఏమని సమాధానం ఇవ్వాలి ?

'ఏం... అంత ఆలోచన చేస్తున్నారు ?'

'...ఎవరో జ్ఞాపకం... తెచ్చుకుందామని. రేపు చెపుతాను లెండి...'

'తప్పకుండా. ఇవాళలాగా మరపు అభినయించకూడదు...'

చూపుల ఎకసెక్కముునకు... లొంగిపోయి... దొంగ అప్పుడే దొరికిపోయేవాడే కాని...

... కారువచ్చి ఆగింది. వెళ్ళినవారు తిరిగి వచ్చారు. శాస్త్రి... మోహనుచాటున నిర్మలకళ్ళకు అందకుండా... టీ తాగి,... వెళ్ళిపోయేటంతవరకూ... దాగిపోయినాడు.

— క్లబ్బుకు చేరుకుని... అక్కడి మిత్రులతో కలసి సీసీ మాలకు తిరిగి... అర్ధరాత్రి మళ్ళీనతరువాత... నడుమువాల్చాడు. కాని... శాస్త్రికంటికి నిదురదూరమైంది. అలలు అలలుగా, ఆలోచనలు ...!

ఏమిటి... నిర్మలవిషయం ...? ఆమె మోహన్‌ను గాఢంగా ప్రేమించుతూన్నదా... లేదా ... ? చేతలలో... వర్తనలో అంత తీవ్ర అనురాగము గోచరించక పోయినా... నిజానికి... మరి, సర్వ సిద్ధమైన తరువాత...

వసంతకుమార్ విషయం అడగటం ఎందుకూ ...? అతని రచనలే... నిర్మల కావ్యజీవనమునకు ఆదర్శములా...? ఎవరైతే నేం... ఆమెకు ఎందుకూ...? రచనలమీాద గౌరవం... క్రమంగా, రచయితమీాదకు... ప్రేమకిరణాలను ప్రసరిస్తూన్నదా...? వెర్రి కోరికలు...! అయినా, ఏమో...

వసంతకుమార్ ...ఎవరో యదార్థంగా చెప్పవలసిందేనా...? చెపితే... మరి, మోహన్...

ప్రథమంలో నిర్మలను చూసినప్పుడు... కలిగిన నిరసన... నిస్పందస్థితి,... ఇప్పుడు... ఈభావాలు... ఎంత మార్పు !

దైవముకూడా... అనుకూలుడుగాఉన్నాడు. విధి నిర్దేశమును తప్పించుకోవాలని ఎంత పెనుగులాడినా... ఆపంథా మంచిదా ?...

—ఆ సాయంకాలము శాస్త్రి వెళ్ళిన వేళకు... నిర్మల ఒంటరిగానే ఉన్నది. మొగవాళ్లు ఇద్దరూ టౌనులోకి వెళ్ళారు. శర్మగారి భార్య... స్నేహితురాండ్రతో మాట్లాడుతూ ...లోపల ఎక్కడనో ఉన్నది.

నిర్మల... లైబ్రిరీలో ...కిటికీదగ్గరగా, నీరెండ మీదపడేటట్లు కూర్చుని... చదువుకుంటూన్నది. సద్దు చేయకుండా వెళ్లి ... శాస్త్రి, అలుమారలలోని గ్రంథనామములను పరామర్శించడం మొదలు పెట్టాడు. విఖ్యాత ఐరోపీయ కావ్యగురువుల ఉత్తమరచనలు— ఆంగ్ల అనువాదములలో, దేశీయ సాహిత్యగ్రంథములు... మూలములో,— చూస్తేనే కడుపునిండేటట్లు... చక్కని బైండింగులలో తీరికలుగా ఉన్నవి...

అంతలో...చూచిందికాబోలును, నిర్మల ...హల్లో అంటూ, చదువుతూన్న పుస్తకంమూసి ... కుర్చీలోంచిలేచి ఎదురుగుండా వచ్చింది. శాస్త్రి ఆమెను సమీపించుతూ...

'ఏమిటి...ఆగ్రంథం... ' అని పలుకరించాడు.

'"రెడ్ లిల్లీ", ఎక్సలెంట్ నావెల్ కదూ !'

'ష్యూర్. ఎంతవరకూ వచ్చారు'

'...కనయితి విభియాన్ బెల్ ... స్నేహితులనందరినీ...టీకి పిలుస్తూన్నది... '

'ఓ...ముఖ్యపట్టులోకి వస్తున్నారు... '

'...కోర్చోండి. ఫాదర్...వాళ్లూ ఇప్పుడే వస్తారు. ఆఁ... బై-ది-బై జ్ఞాపకం చేసుకున్నారా ?'

'చెప్పుతానులెండి. ఏవీ... మీ రచనలు— చూపిస్తా నన్నారు కాదూ...'

'... ఆమాట... ఇంకా మరచిపోలేదూ... '

'ఇంపాస్. తీసుకురారూ ?'

— నిర్మల... డ్రాయరు లాగి... ఫోల్డరు అందుకుని... రిబ్బన్ సడలించి... కాగితముల దొంతరను... ఎదురుగా ఉంచింది.

లేతగులాబీ... బెల్జియన్ బ్రాండ్ పేపరు... బొగెయిన్ వీలా... పసివాసన... శాస్త్రికి... తమకం హెచ్చించి పారవశ్యం కలిగించింది. పరిశీలించడం మొదలు పెట్టినాడు. అవి చాల వరకూ కథలు. పద్యాలు... చాలాకొద్దిగా...

"కలువ కన్నులు"... అనే కథ కనిపించింది. 'చక్కని చుక్కనని... ఆ నవమోహినికి తగని గర్వం...! ఒకమారు చూసి తే... చాలు... చలించని వారు... చూపుమళ్లించుకుని... దిటవుగా ఉండగలిగిన తాహత్...'— అని మొదలు...

'అయితే... ఎవరు, ఆ వసంతకుమార్ ?'

'ఆ...ఆయనా...? చెపుతాను—ఎంత బాగున్నదండీ... కథ...'

'సరే ... ముందు చెప్పండి...'

'చదవనీయండి. పేరుకూడా అందంగా ఉంది... "కలువ కన్నులు..."'

'చెప్పితీరాలి... తరువాత చదువుదురుకాని...'

'తెలుసుకుంటే... మీకు ఏం ప్రయోజనం ?'

'అదంతా మీకు ఎందుకూ...? మాట తప్పించకండి, చెప్పరూ...'

'మీరు... ఎరుగున్నారు...'

'అబద్ధం... ! పోనీ లెండి... '

'మీరు... చూశారు... '

'చూశానా... ఎప్పుడు... ? '

'మాట్లాడారు... '

— నిర్మల... శాస్త్రి వేపు వింతగా చూసి...తప్పుజవాబు చెప్పేకుర్రవాడిలాగు... అయిష్టంగా...

'మోహన్ '

శాస్త్రి...ఆపేరు ఆమెఉచ్చరించడమే...సహించలేకపోయినాడు. మోహన్ !... వసంతకుమార్!...దాచుకోలేని పరిహాస రేఖ...కనులలో నర్తించినది.

'అవునా...కాదా ? '

...ఈ ప్రశ్న అనవసరమని...కలిసి పెనవేసుకుని పోతూన్న వాళ్ల చూపులే...సాక్ష్యమిచ్చినవి. నిర్మల...అర్థం చేసుకునేనా... అర్థంకానట్టు నటించి...కొంటె!

'వసంతకుమార్... ! '

నిర్మల కుడిచెవి...లోలక్...శాస్త్రి చెక్కిలిని పుణికింది... ఉత్తరక్షణమున...

మరి...మోహన్... ?

నిర్మల కలువకనుల్లో... కేరింతలుచూసి...శాస్త్రి, మోహన్ మాటను...తననే తాను...మరచిపోయినాడు...

...అప్పుడే అచ్చయివచ్చిన...'హారైజన్స్'...అనే నూతన ఆంగ్ల కావ్య సంపుటిని చదువుతూ—హాలులో ఆ అమాయకుడు మోహన్...కూర్చునిఉన్న సంగతి—ఎవరికి కావాలి ?

***

*
* *

భాయీసాబ్ ...

—అన్నమాట చెల్లించుకుందామనే పట్టుదలేతప్ప...నిజంగా నీకు ఉత్తరం వ్రాయడానికి కావలసినంత హుషార్...ఏమీ ఒనగూడే భాగ్యం ఈ సోదరుడికి లభించింది కాదని... చదివినతరువాత నీకే తెలుస్తుంది.

మధురానుభవములకోసం...ఉవ్విళ్లూరడం అడియాస అని... కల్పించుకున్న ఆకాశహర్మ్యముల పునాదులు కదిలిపోయిన తరువాత కాని... అవగతము కాలేదు.

మొదలు...ఏమీ వ్రాయకూడదనుకున్నాను. ఈ సంగతే ఇక తలపెట్టకూడదు, మరచిపోదామనుకున్నాను. కాని, ఎదుటకు వచ్చిన తరువాత, ఏలాగూ వదలవుకదా...చెప్పక తప్పుతుందా; నీవు ఊరుకుంటావా...అప్పుడు బిడియపడుతూ...సగం చెప్పి— చెప్పక నిన్ను అలయించి...విసిగించడంకన్న...ఇలా చేస్తేనే బాగుంటుందని తోచింది.

ఇంకొక కారణం కూడాను. ఎటూ పాలుబోకుండా, మానసికంగా త్రిశంకు స్వర్గవేదన అనుభవిస్తూన్నాను గనుక...ఉద్ధరించే బాధ్యత నీదైనప్పుడు విషయం నీకు సమగ్రముగా తెలియకపోతే ఏలాగ ?... కర్తవ్యం ఉపదేశించడానికి...నీకు...ఆలోచించడానికి, ఈ గడువు చాలుననుకుంటాను. నేను వచ్చిన తరువాత, మళ్లా ఏమీ ప్రశ్నలువేసి బాధించకు. ఏమీ దాయకుండా వ్రాస్తూన్నాను...సందేహించకుండా...నీకు, సందేహాలు కలుగకుండా.

మూడు రాత్రులు

తత్వ దృష్టితో చూస్తే... ఈ కలాపమంతా చాలా సరదాగానే ఉన్నది—ఊహించి, మనం కల్పించి గ్రంథస్థము చేసే సంవిధానాలకన్న... ఈనటనస్వానుభవంగా ప్రత్యక్షముకావడం...! కాని, నాయకుడు నేనేకదా అని... కించ.

దురుసుగా ... అపార్థములుతీసి ... నన్ను విమర్శించకు. మిన్ను విరుచుకుని మీదపడే సమయాల్లోనైనా ... తొణకని, నీ హుందాతనం... ఈసంక్షోభార్ణవమగ్నునికి ఆసరా అయి తెప్పరిల చేస్తుందనే ధైర్యం నాకు ఉండటంచేతనే... సావధానంగా ఆలోచించమని అవసరంలేకపోయినా... హెచ్చరిక !

ఉత్సాహసామగ్రి అంతా... పుష్కలంగా అందుబాటులో ఏర్పరుచుకుని, మరి... చదవడం మొదలుపెట్టు. సిగరెట్లు అయిపోయినా, టీ చల్లారి, రుచి తక్కువ అయినా... వాటిమీద కోపం... నామీదకు మరలించకుండా.

'కర్మణ్యే వాధికారస్తే... '—గీతావాక్య మనమొదల తలక్రిందులుగా అన్వయించుతూన్నది. ఉబలాటపడి, చేసినవారు, పెద్దలు: ఫలం అనుభవించే అధికారం, ఆ మంచి చెడ్డలు... మనది !

చెట్టుగా ఉన్నప్పుడే ఏప్రయత్నమూ చేయకుండా ఊరుకుని... తీరా ముదిరి మ్రానైన తరువాత, మరమ్మతు చేయడానికి తలపెట్టడం... ?

ఒకటిలే : ఇంతకూ...అన్నీ మనం అనుకున్నట్టుగా జరిగితే... ఇక చెప్పవలసింది ఏముంది ?

ఎంత ముచ్చట పడ్డానో... ఎంత ఉవ్విళ్ళూరానో... ! ఎందుకులే...అవన్నీ ఇప్పుడు, తలచుకున్న కొద్దీ... యౌవనోదయభాగ్య జీవన స్వర్ణసంక్రాంతిలో ...అన్నీ హంసపాదలే.

ఛాందస తతంగమూ... పబ్లిసిటీ...వద్దని పట్టుబట్టాను... బ్రతిమాలాను, మావాళ్లని. మనసులో ఏమనుకున్నా... ఒప్పు

కునేవారేమో కాని, మా అత్తవారి తరఫునుంచి వచ్చింది ఉద్దడి. 
మా, మామగారి తల్లి...ఆ ముసాలితో కూ, మనుమరాలు-మను
మడూ, పీటలమీద కూర్చుండగా చూసి సంతోషించాలనే...
ప్రత్యేకం అందుకోసమనే.. ఇంకా బాల్చీతన్నేయకుండా, కని
పెట్టుకుని ఉందట...! ఆ ముసలిపాపాయి ముద్దు చెల్లించవద్దూ...
అది ముఖ్యం కాదూ?

మోతుబరి ఆసామి కనుక మా మామగారు...పునస్సంధా
నానికే... పెళ్ళంత ప్రయత్నం చేశారు. మామమూలల బంధువు
లందరూ...సకుటుంబసపరివారంగా...ఇంట్లో పొయ్యిలు త్రవ్వేసు
కుని తరలివచ్చి...క్రిక్కిరిసి ఉన్నారు.

ఇక, ఆనాడు, ఉదయంనుంచీ... రాత్రిదాకా నడచిన
తంతు...మనం మామూలుగా విని నవ్వుకునే, పూర్వ కాలం పంక్తికి,
శతగుణితంగా ఉన్నదనుకో. పవలూ రాత్రికూడా సరిగా భోజనం
పెట్టకుండా...ఇక, మహార్యాసీగా అల్లుడుగారికోసం తయారుచేసిన
కాఫీ, అధ్వాన్నంగా, కుడితిలాగు ఉంది. వేధించుకుతిన్నారోయ్...
వీళ్ళ ఛాందసం కూల!

సాయంకాలం...యథాప్రకారం, బ్రాహ్మణోత్తములు...
సామవేదం పనసచదివి...వాళ్లు ఆ...ఊ...ఉ...అనడం వింటే
చెడ్డనవ్వువస్తుంది, నాకు. సంభావనలు కాజేసి...వెళ్ళిపోయిన తరు
వాత, నేను...స్త్రీ రాజ్యంలోకి...ఖయిదీఅయినాను. పనంతెగిది.
సరిగా మెసలడానికే సీలులేదు ... చూస్తేనే ఊపిరిసలుపనట్టు
ఉన్నది!...ఆ గదిలో...ఆడవాళ్ళ తండావచ్చిపడి—ఎందుకులే...
ఆ సంగతులు తలచుకుంటేనే చిరాకు ఎత్తుతూన్నది...

చివరకు, ఇద్దరం మిగిలాం. మా ఆవిడ... పందిరిమంచం
స్తంభాన్ని ఆనుకుని, తలవంచుకుని...నిలుచున్నది. నేను...పలాపలుక
రించాలి, ఏమనాలి?...ఒక నిమిషం నిదానించాను. తలఎత్తి

చూస్తుందేమో, చూపులు కలపవచ్చునని...నవ్వించాలని. తరు

వాత చొరవచేసుకుని, మాటాడించలేకపోతానా ?...

కాని కదిలితేనా...? స్థాణువై అలాగే నిలుచునేఉన్నది!

బల్లమీద...తినుబండారాలు ... కృష్ణదేవరాయలనాటివి... పెద్దపళ్ళెంలో...ఒక సంతర్పణకు సరిపోయేవి ఉన్నాయి. దయదలచి తడి అంగవస్త్రం ఉంచడం మానివేశారు...! మునుపు ... పెళ్లి కొడుకులు అంటే ఏమనుకున్నావు ఏమిటి...? కాశీలోపడి... చదివి చదివి... యాదృచ్ఛికంగా, గురువువృద్ధుడైతే, తారాశశాంక నాటకం ఆడి ... గడ్డాలు మీసాలు ముదిరి, కాశీకావడితో స్వదేశానికిమళ్లీ వచ్చి...అంతకు ముందే భార్యయీడేరి సిద్ధముగా ఉండటంచేత... కార్యమని...పెళ్లి కొడుకు ... ఊళ్లోదిగగానే ... ముహూర్తము ఏర్పాటుచేసేవారట...! మడీ ఆచారమూకాదూ, గడితలుపుగడియ పడ్డతరువాత, పెండ్లికుమారుడు కాళ్ళూచేతులూ కడుక్కొని...తడి అంగవస్త్రంకట్టుకుని...లక్షణంగా, పెట్టిన మినపసున్ని అరిశెలూ వగయిరా ఆఖరుచేసి...ఆబందోబస్తుతో, తృతీయపురుషార్థంమాట తలపెట్టేవాడట!...ఆలాటివారి సంతానం... రాళ్ళులాగా, రోగం రొష్టూలేకుండా ఉండేదని...మన ముసలమ్మలే ప్రమాణం!

—జంతిగ ముక్క ఒకటి విరిచి మీదకు విసిరాను. అరిశె ముక్కలు...క్రమంగా మినపఉండలు, తుంచి ... మొత్తంమీద పళ్ళెంలో భక్ష్యాలన్నీ సరాగంలో ఖాలీచేశాను. మా కాళ్ళముందర అవిఅన్నీ, చిందరవందరగా చెదిరిపడిపోయి ..నేలఅంతా...లడాయి అయిన మర్నాడు బందరు రోడ్డులాగా ఉన్నది.

ఇక విసరడానికి ఏమీలేవు ... పళ్ళెం తప్ప ...! తగిలిన వాటిని ఖాతిరుచేసింది కనుకనా ?—రాళ్లవాన కురుస్తూన్నప్పుడు గోవర్ధనంక్రింద దాక్కున్న గోపికలాగా...

సమీపించి, చుబుకం పట్టుకొని, మొగం ఎత్తడానికి ప్రయత్నం చేశాను. ఉహుఁ...కదలందే...! యోగాభ్యాసిలాగు బిగదీసుకుని ఉన్నది. ఇంకో ప్రక్రియ ఉపయోగించుదామని...చేయి మోటగా పట్టుకుని, దగ్గరకు లాక్కుందామని గుంజాను. కాని, ఎడమచేత్తో మంచం స్తంభం పెనవేసుకుని...వదలందే...! ఇలా టగ్-ఆఫ్-వార్ కొంతసేపు జరిగింది,—శత్రువులు క్రమంగా, బడలిపోయి, లోబడే సూచనలు కనబడుతూండగా...

బయటనుంచి, తలుపు ఒకటి రెండుసార్లు ఊచి, ధడ ధడ కొట్టి...'ఓమారు, కాస్త తలుపుతియ్యి నాయనా... మళ్లావేసుకుందువుగాని' ... అంటూ పిలుపు!

...తలుపు తీశాను. మా అత్తవారి తరఫు ఆమె...ఏమవుతుందో తెలియను, విశ్వాస, ముసిముసినవ్వులతో...లోపలికివచ్చి...మంచం చాటున ఉన్న పెరుగుకుండ,... కప్పిన స్త్రీ, ఎత్తుపెట్టిన పిడకా, అక్కడేపడేసి...బయటికి తర్లించుకుని పోయింది. నాకు, బలే నవ్వు వచ్చింది. నవ్వితే, ఆమె ఏమనుకుంటుందో అని, తలుపు దగ్గరగా లాగిన తరువాత గడియ వేయవచ్చునని...అలా నిలుచునే ఉన్నాను.

తక్రఘటధారిణి...అక్కడ నుంచి కదలే పోహణ కనుపించుట లేదు నేను, తలుపు వేసుకునేందుకైనా వీలులేకుండా... గుమ్మంలో, ఓకాలువేసి, ప్రక్కకు తొంగిచూస్తూ ఆలకించుతూన్నది—

'కనిపించాడా అమ్మా?'...అని ఎవరినో అడుగుతూంది.

'లేదే అమ్మా!...మీఅల్లుడుగారు...ఊరూనాడూ వెదికి వచ్చారు. ఏమైనాడో అమ్మ!'—దృష్టిగోచర అయిన...నడి వయసు సువాసిని జవాబు చెప్పింది.

‘కొంటె కుంక, ఓచోట నిలుస్తేనా...? ఎక్కడకు వచ్చినా, ఇదే కుమ్మరాం. వట్టి గడుగ్గాయి అయిపోతున్నాడేం...! ఏమనాలన్నా నక్కాడేమో...’ ఇది పెరుగుకుండ ఆమె వ్యాఖ్యానం.

‘అవునేవ్!... ’ అని ... ఏదో ఆలోచన తోచినట్టుగా, తల్లితో రహస్యంగా ఏదో అన్నది...సువాసిని. ఇద్దరూ గుసగుస లాడుకున్న తరువాత...

‘లక్షణంగానే ఉంది...’అని సణుగుకుంటూ, విశ్వస్థ... మళ్లాలోపలికి వచ్చింది.. కూతురుతో సహా. ఇద్దరూ, తొంగి చూస్తూ... చివరకు, కూర్చుని...మంచంక్రింద వెదికి.. కావడి పెట్టె చాటునుంచి... ఓ కుర్రవాణ్ణి బయటకు లాగారు...! నిల వేసి...చెవి మెలిపేసి...తల్లీ, ముత్తవ్వాను...సవాలక్ష చదివి, నా ఎదుటనే పంచాయతీ తీర్చి— పిల్లవాడు, వాడి పుణ్యమూ అంటూ గింజుకుని పారిపోకపోతే,— తెల్లవార్లూ నన్ను వేధించుతూ ఆలాగే ఉండి పోయేవారను కుంటాను,...వాడిని తరుముకుంటూ, ఏలాగైతేనేం... దయదలచి... అక్కడనుంచి వెళ్లి పోయినారు.

మళ్లా .. యథాప్రకారం...! మా కొయ్యబొమ్మ.. మాటాడితేనా ..? ఎన్నివిధాలో ప్రయత్నించాను. తెలివితేటలన్నీ వినియోగించి చూశాను. సినీమా అనుభవములన్నీ నెమరుకు తెచ్చుకున్నాను. కాని, ఉహుఁ...

అరసికత్వానికి...నన్ను మన్నించాలి. కాని, ఏమి చేయను...? వెఱ్ఱిపడి కోరికలకు పొంగురాకుండా, నిగ్రహించగలిగిన సామర్థ్యం లేకపోయింది. నింపాదిగా యోచించే అంత సహనంకూడా లేదనుకో. మోటగా...పశువైఖరిని...మొక్కుతీర్చుకున్నాను... !

నామీదనే నాకు అసహ్యం కలిగింది—చేసినపాడుపనికి...! అప్పటి ఉద్రేకం అంతకన్న వేరుమార్గం చూపించిందికాదు.

ఇకనైనా...సిగ్గుతీరిందేమో ననుకున్నాను. చనువుగా పలుకరించాను. సరదాగా మాటలాడుతుందేమో ననుకున్నాను. పడిన శ్రమకు ఫలం ఇంతటికన్నా అబ్బుతుందేమో!...కాని...అనుభవించక తప్పుతుందా, భయ్యా! పూర్వజన్మకృతం పాపమ్...! మాటా లేదూ, మన్నూ లేదు.

కోడి కూసే వేళకు...కొంచెం కూర్కు పట్టింది. మెలకువ వచ్చేటప్పటికి బాగా పొద్దు ఎక్కింది. మా పెండ్లికూతురు చీకటితోనే...బయటికి వెళ్ళిపోయింది కాబోలు, తెల్లవార్లూ మేలుకునే ఉన్నదేమో...ఆమె విషయమే...ఆ తరువాత, నేను గమనించ లేదు లే.

—ఇక మరునాడు :

నిద్ర మేల్కాంచినప్పటినుంచీ కూడా...రాత్రి అనుభవించినదంతా, పీడకలలాగు కనిపించి... చాలా వేదనపడ్డాను. అక్కడ నుంచి తక్షణం బయలుదేరి పోవాలని, మొదటి ఆలోచన. ఎవరు ఏమనుకుంటేనేం?...నా మనసులో యాతన అందరికీ ఏలా తెలుస్తుంది? పైగా ఎవరిది ఏం పోయింది? రాత్రి భార్యను సరిగా ఏలుకున్నందుకు...వాళ్ల దృష్ట్యా... అభినందనపుచూపులు విసిరే వృద్ధ స్త్రీలోకమును చూసినకొద్దీ...ఉన్న పాళమున, అప్పటికప్పుడు జండా ఎత్తేద్దామనుకున్నాను.

ఆ...అమ్మాయితో... కాపురం చేయడం అసంభవం. మా యిద్దరికీ పొత్తు ఏలా కుదురుతుంది?...పల్లెటిదిక్కు బైతు ... లోకజ్ఞానం బొత్తుగా లేనిది... సనాతన మర్యాదలది,—ఆమెను వెంట తీసుకునివచ్చి... ఏం చేయడం?

—వదిలి వచ్చాననుకో. మా, మామగారు ఘటికుడు; ఊరుకునే రకం కాదు. నా పెళ్లి అయినప్పటినుంచీకూడా...'నారీణాం చిరవాసోహి బాంధవేషు నరోచతే...సతీమపి జ్ఞాతికులైక సంశ్రి

యాం, జనోన్యథా భర్తృమతీం విశంక్యతే... భాగ్యాయత్తమతః వరం సఖిలు తద్వాచ్యం వధూబంధుభిః'—ఇలాటివి, కొన్ని సహస్రాలు శ్రీసూక్తులు వదులుతూండేవాడు. ఆయనఊరుకుంటాడా?... చల్లగా, మంచిరోజుచూసి, ప్రయాణంచేసి తీసుకువచ్చి ... నేను ఎక్కడ ఉంటే అక్కడ దింపి చక్కాబోతాడు. మళ్ళాతిరిగి చూడడు. మేను ఏమైనాసరే...

అదీచిక్కు ! నామాటకు ఏమికాని, అప్పుడు ఆ అమ్మాయి పని ఏం కావాలి ?...నాకు అక్కర లేక...పుట్టింటివారు చేరనీయక, పైగా, చేతులార చేసుకుంటినికూడా నాయెను...గడిచినరాత్రికి... యావజ్జీవం... బాధ్యతనామీద పడలేదూ ?

ఇంకొకటి : ఆమె మనోగత భావములకు చక్కిలిగిలి పెట్టే రసికత్వం మనలో లోపించిందా అనే శంక...! ఆమెను, అర్థంచేసుకో లేక పోయినానేమో...? అలరించడం చేతకాలేదేమో... ? ఆనాటికి...తొందర పడకుండా... లేచిపోయి వచ్చేసే ప్రయత్నం విరమించుకుని...ఏలాగైనా ఆమెను సుముఖినిగా చేసుకోవలెననే దీక్ష పట్టాను.

రాత్రి...ఏకాంతమున...

బయట చక్కని వెన్నెల వచ్చింది. మాగది కిటికీల అవతల మెరాబాలో మంచి జాజి పొద ఉన్నది. లోపల—ఉక్కపోతున్నాము. మరీ, ఊరగాయల కొట్టు లాటిది ఆ 'శయ్యాగార'మని... నీవు అర్థంచేసుకునే ఉంటావు...ఈపాటికి ! ఆరుబయట, ఎందుకు మంచం వేసుకోకూడదూ అని—

'చూడు... సుభద్రా!... (మాగృహిణినామం...సుబ్బమ్మలోంచి, సుభద్రలోకి ఇటీవల మారిందటోయ్, మనకు ఎవరికీ తెలియకుండానే. మా, మామగారు... నేను దిగగానే చెప్పిన మొదటి

శుభవార్త అది)—వెన్నెలలో కూర్చుందాము, రావూ?...' అని బ్రతిమాలుతూ అడిగాను. 

నేను...పేరుపెట్టి పిలిచినందుకు, ఆ అమ్మాయి ఎక్కడలేని ఆశ్చర్యమూ...కళ్లలో కనబరచింది. బహుశః వింతగా తోచి ఉండవచ్చును. వాళ్ల వంశంలో, బంధుకోటిలో, ఎవరూ భార్యలను పేరుపెట్టి పిలిచిన పాపానపోయి ఉండరు...! మరీ మాలకూడు అయిపోయి, సంకరం చేస్తూన్నవి...మన చదువులే కాదూ?

'ఏం...' —ఓంకారంలో త్రిమూర్తుల అంశలూ ఇమిడినట్లు, ఆ 'ఏం...'లో,—'ఏమిటి, వెన్నెలలో సరదాగా కూర్చోడం నీకు యిష్టమవునా, కాదా ? కాకపోయినా, నేను కోరుతున్నాను కనుక నీవు ఒప్పుకుని తీరాలి ? '—అనే లాలన...ఆజ్ఞ... ఇంత ఇమిడించాను.

'ఆరుబయట... భారకిస్తుంది... '

—అమ్మబాబు ! మాపెద్దలందరూ తరించారోయ్... ! మా గృహిణి నోరువిప్పి...ముత్యాలురాల్చింది !

'భారకంలేదు...సింగినాదంలేదు... లేచిరా...'—కొంచెం గదమాయించితేనే కాని కార్యం సానుకూలమయ్యేటట్టు లేదు.

సుభద్ర...తలవంచుకునే... లేచినిలుచున్నది.

చిన్నమంచం... లేదు. పందిరిమంచం చక్కీ...బహుప్రియాసతో—అది చచ్చినగేదెదూడంత బరువున్నదోయ్...! సరే మంచం సంగతి చెప్పనక్కర లేదు... మూలిసిన్ పడకగదిలో నమూనాచూసి తయారుచేయించిన బాకతు—ఏలాగైతేనేం... బయటకు చేరుకున్నాం.

నడుమువాల్చను. సుభద్ర, వచ్చి దగ్గరగా కూర్చోవద్దూ ? ఊహుఁ...దానికిమళ్ళా బ్రతిమాలించుకుంది...

'వెన్నెల...ఎంతబాగున్నదో... '

'ఇన్ని జాజులు ఉండగా...షోగ్గా వంకీజడ వేసుకోలేక పోయి నావా ?...'

'సిల్కు చీర... నేను పసందు చేసి తీసుకువచ్చాను...కట్టుకో లేదేం...'

—ఏ మాటకూ జవాబు లేదు, కారణం...ఏం చెప్పాలో తెలి యక. అలా తయారు చేశారోయ్ వాళ్ళ వాళ్ళు...! ఆడవాళ్ళు ఎందుకు...అనే ప్రశ్నకు... వెంకటేశం సమాధానాలు ఉన్నాయే.. అంతకన్న పరిజ్ఞానం ఉన్నట్టు తోచదు మా ఆవిడకు...! ఏదో మాటాడుదామని పెదవులు కదిపేది...కాని, మాట బయటికి రాందే !

వెన్నెల సరదాలన్నీ... ఆ అమ్మాయిని అలా చూపెట్టు కుంటూ... నేనే తీర్చుకున్నాను. జాజిపూలతో ఆమెను...వన దేవతను చేశాను. పక్క అంతా విరజిమ్మాను. నవ్వాను... ఈల వేశాను,— ఈ ఉత్సాహమంతా... ముంచేస్తూన్న నిరాశను కప్పి పుచ్చడానికి...

చివరకు...మామూలుగా...సామాన్య సంసారిలాగా...!

—తెల్లవారింది... పొద్దుగుంకింది. నామనసులో పవ లంతా...నేషనల్ కాంగ్రెస్ సంత హడావుడిగా ఉన్నది. ఈవిషయం తలచుకుంటే...గుండెల్లో స్పెషల్ రైళ్ళు పరుగెత్తడం మొదలు పెట్టినవి. ఏమిటి చేయడం... అనేదే జపం అయిపోయింది...! ఆమె...నాకు జోడైన భార్యగా, సరదాలన్నీ తీర్చే వివేకవతినిగా తరిఫీదుల్ చేయడానికి. ఈ జీవితమంతా వినియోగించడమా...? అంతకన్న సులువుగా అయేపని కాదోయ్ అది... ! తరతరాలనుంచీ పాడుకు పోయిన ఛాందసత్వమును పెల్లగించి, కొత్త కోరికలను అల్లించడానికి దోహదం చేసి... వర్ధిల్ల జేయడం... మాటలతో ఉన్నదా?...

లేక, ఈ బాతరబందీ అంతా వదిలివేసి, పాపమో, పుణ్యమో... ఉడాయించేసెయ్యడమా...? ఏమీ తేలడంలేదు...

ఆఖరుకు... మూడవ నిదుర ముచ్చటకూడా తీరనిద్దామను కున్నాను: నిజానికి... ఆమెను చూడగా, వదల లేక పోతున్నాను. శారీరకములైన వాంఛలు, ఆమె రమ్యాకృతిని గౌరవిస్తూన్నవి. మనసు... ఈ అరసికురాలితో నీకు ఏమిపని అని ఎదిరించి పోట్లాడు తూన్నది: రెండింటినీ కాదన లేకుండా ఉన్నాను. ఉపాయం నీవు చెప్పవలసినదే ఇక ...

—మరో ఉపాయం తోచింది. లాలనగా ఆమె లొంగి పోనప్పుడు... జాలి అన్నా కల్పించితే...క్రమశః చనువులోకి దింప వచ్చును కదా...అని, రాత్రి...మేము ఒంటరిగా మిగిలిపోగానే... బద్ధకం, శిరోభారం అభినయించాను—ఆ ఆదుర్దాతో అయినా సిగ్గు తెరవిడిపోతుందేమోనని ... కాని—

మంచంమీద కూర్చునిఉన్నవాడినల్లా...అబ్బా! అను కుంటూ పక్కకు ఒదిగి... 'చూడు ...సుభద్రా...తల బరువుగా ఉన్నది...'

ఇంకా, చెపుతూన్నది సాంతం వినిపించుకోకుండానే...ఆమె, చివాలున, ఆదుర్దాతో మాత్రం అవును... లేచి వెళ్ళిపోయింది...!

దగ్గరగా కూర్చుని...ఉపచారములు చేయడానికి పూనుకుం టుందేమో,—ఏలా ఉన్నది...కొంచెంనింపాదేనా...అని పలుకరించు తూంటుందేమో,— తల...తొడమీద జేర్చుకోనిస్తుందేమో,— అని ఉవ్విళ్లూరినందుకు...వంక పన్నినందుకు... ఫలం...

ఏఘూ౯టైనమందో తీసుకువచ్చి... తలకు పట్టించిందాలంటే... లేనిది లేకపోగా...కళ్ళూ మొగం మండిపోయి అదోయాతన అనుభ వించవలసి వస్తుందే ?...

‘ ఏం నాయనా ? ’—అని గుమ్మంలోనుంచే పలుకరించుతూ...ఇంతకుపూర్వం ఉదహరించానే...పెరుగుకుండ ముసలమ్మ... ఆమె తయారయింది,...మా మామగారి తల్లిని తోడు తీసుకుని.

వారు...యకాయకి లోపలికి రావడంచూసి ... లేచికూర్చున్నాను. నన్ను మరేమీ పలుకరించకుండానే... మెదలనివ్వకుండానే...చేతులోవున్న శొంఠిగంధం...గుమ్మానికి పసుపుమెత్తినట్టు... మొగమంతా రాచి...(ఈపని తన విశ్వాసవంతు)... ‘ముసుగు పెట్టుకుని మెదలకుండా పడుకోవోయి... తెల్లారేటప్పటికి తగ్గిపోతుంది. అయినా, ఈకాలం ఆరుబయట పడుకోమని ఎవరుచెప్పారు... మంచు కురిసే దినాలుకదా...? ఇప్పటి తగిలీ ఇదీ’...ఇద్దరూకలిసి, ఈపనస చదివి...నిష్క్రమించారు, గదితలుపు దగ్గరగా వేసి...!

ఇంకా నయమే అంతటితో వదిలారు. కలికం వేస్తామని పట్టుపట్టి నట్లయితే...మా ముత్తాత జ్ఞాపకం వచ్చేవాడు...నసాళం అంటి!

పట్టు కడిగివేసి...పడుకున్నాను. సుభద్ర...ఏదీ ?... చేతులారా, నేను తెచ్చిపెట్టుకున్నదే కాదూ, ఈ అవాంతరం?... సుస్తీగా ఉన్నదని ఇంటిల్లిపాదికీ తెలిసిపోయిన తరువాత...ఇక, ఈ చాయలకైనా రానిస్తారా...? మామంచికోసమే ననుకో...

ఒంటరిగా...నిజంగా సుస్తీగా ఉంటే... దగ్గర...పిలిస్తే పలికే దిక్కు లేక...బాధపడుతూ ఉండవలసి వచ్చేదేకాదూ?... ఆ మాత్రం ఇంగితం లేదూ...? నన్ను ఇలా వదిలివేసి... తాను దూరంగా... ఎక్కడో వాళ్ల వాళ్ల మధ్య పడుకోవడమేనా ?

—నాకు, విపరీతమైన కోపం వచ్చింది. పిలిచి...నాలుగు ఇచ్చుకుందా మన్నంత ఒళ్ళుమండి పోయింది.ఆలాగే...ఆలోచనలతో...ఉద్రేకంతో...రాత్రిలంతా గడిపాను. ఆనాడు...నా అవస్థ...వర్ణనాతీతం ! పగవాడికైనా వద్దు...

తెల్లవారుతూన్నదనగా... కనులు, ఉదయ మందవాయువుల హాయికి... మూతపడుతూండగా, తలుపు తీసుకుని... సుభద్ర వచ్చింది...! నిసురమత్తుతో...చూడగానే...అమితోత్సాహంతో... లేచి కౌగిలించుకుందా మనుకున్నాను. కాని, ఆమె ఏం చేస్తుందో గమనించవలెనని కనులు అరమూసి నిద్రితుని లాగు ఉండి పోయి నాను...

సుభద్ర...తిన్నగా వచ్చి... నా... పాదాలకు చేతులుఅద్ది... కళ్లకు అద్దుకుని...తిరిగి వెళ్లిపోయింది...!

ఆయ్ ఖుదా !

ఆమె...అలా...నా పాదములు స్పృశించితే దేహమంతా తేళ్లు జెర్రిలూ పాకుతూన్నట్టు కంపరం ఎత్తిపోయింది. ఈ పాతివ్రత్య మంతా...ఏలాగోయ్ భరించేది...? ఇలాంటి దానికి...నాగరికం అల వాటు చేయడం నా తరమా ?

—వెనుకటికి, మా బంధుకోటిలో ఒక ఆమె...సర్వకాల సర్వావస్థలలోనూ... మడివిడవకుండా...పూజాగృహాం గుమ్మం దాటకుండా ఉండేదట...! ఎవరన్నా...చివరకు ...ఆ చేసుకున్న మొండవాడైనా సరే...ఆమెతో మాట్లాడాలని...ఆ గదిలోకి వెళ్ళి తే...వాళ్ళు అక్కడనుంచి లేచిపోగానే కూర్చున్న స్థలం...శుద్ధిచేసే దట ..! మా గృహిణి కూడా, ఇంకా నాలుగురోజులుపోతే ఆలా తయారవుతుంది...సందేహం లేదు.

ఏంచేయను ? నాకు మొదట తోచిన ప్రశ్నే...నేను నిర్ధా రించుకోలేని విషయమే...నిన్ను అడుగుతూన్నాను. తెగించుకుని పారిపోవడమా ?... యావజ్జీవం, యీ గుదిబొయ్యను మెడకు వేసు కుని...యాతనపడటమా...? ఆమె మారిపోయి...నాకు అక్కరకు వస్తుందనే నమ్మకం లేశమున్నూ లేదు. కర్తవ్యం ఏమిటో నీవు ఉపదేశించాలి—

ఒక, మరా: పెద్దల అపరాధాలు వారసత్వరూపేణా మనకు సంక్రమించేవి కనుక...త్యాగం చేయవలసిన బాధ్యత నామీద ఉన్నదనే పెద్ద ఆలోచనలోకి పోవద్దు. విధికి తలఒగ్గి...జితోస్మి అనే అలసత్వం నన్ను ఇంకా ఆవహించలేదనే సంగతి 'జ్ఞాపకం ఉంచుకో. నామంచికి...నా పురోవృద్ధికి...ఇతరులెవరికీ ఈమూలాలమున అపకారం జరుగకుండా...నేను చేయవలసినది...ఏమిటి ఇప్పుడు...?

బాగా ఆలోచించి...నేను వచ్చేటప్పటికల్లా...జవాబు చెప్పడానికి...తయారుగా ఉండాలి సుమా ?—నేను...ఏంచేయాలి...చేయడం ఉత్తమం...?

నీ

'.........'

* * *

* * *

ఎక్కడ ?...

స్పార్టాలోనా ... ఏథెన్సుపురోద్యానములోనా? ... మహాశిల్పి ఫిడియసు... కరువునబోసి, వనితనములో చైతన్యభ్రాంతులూరించిన వృషభవిగ్రహములనుచూసి ... గ్రీకుగోయాథము గార్భిణమైనది... ఎక్కడ...?

రాజమహేంద్రవరంలో ... ఉపన్యసించినది ... నేరారోపణముకాగా ... రాజకీయ నిర్బంధనమున ... కోయంబత్తూరు జైలులో ... పద్ధెనిమిది నెలలు పరిమితిగా ... ఏకాంతవాసము చేస్తూన్న క్షీరసాగరం జీవితారామవాటిని... ఒకపరి, ఆనాడు చైత్రశోభలు .. వన్నెలు తేలినవి. దేశహితమే... ఏకైకలక్ష్యంగా... స్వార్థరాహిత్యము అలవరచుకున్న ... యోధమూర్తి మనస్సరసిని... కలువకన్నె... ప్రణయాపాంగ తరంగికలు ... చిలువపలవలై ...కలచివైచినవి.

'...కవలపిల్లలు!... మూడవనెల మొన్న పంచమికివచ్చింది : కృష్ణసాగరం, సాగరేశ్వరి...(ఇంకోపేరు సాగరబాల) అని నామకరణం చేశాము. —ముద్దుకు... వెండిగవ్వలు...అని పిలుచుకుంటూన్నాను. అభ్యంతరమేమీ లేదు కాదూ?— క్షేమం వ్రాయించండి...

—కనకం'

—ఉదయమే టపాలో వచ్చింది ఉత్తరం. అధికారులు... విప్పిచూసి... మాటు మణచవలసిన అవసరము లేని యింటివిషయము

లని...సమీాక్షలో అన్వయించుకుని, రవాణా చేయగా, సాయంకా లమునకు బట్వాడా అయినది. భోజనము చేసి...గీతలను పఠించి, అప్పుడు...చదివాడు.

తనకు, ప్రత్యేక సంబంధము ఏమీా లేని...సంతోషవార్తను ఆదరించే శుభోత్సాహమే తప్ప విశేషము ఏమీా గోచరించినది కాదు, మొదట. చదివి...చదువుతూ, తదవలంబనమున భావ నలో తేలిపోయి...పూర్వస్మరణముతో...అన్వయించుకుని, ఆశ్చర్య పడిపోయినాడు. మోహపుచూపుల విలునలు...గ్రీకు కథలలో చిన్ననాడు చదువుకున్నవి జ్ఞాపకం వచ్చినవి...

కనకం...వెండిగవ్వలు...కవలపిల్లలు— ఈ త్రిరత్నములను అప్రియత్నంగా...భావనాధీనుడై మననంచేస్తూ...వెనకటి కథ... మానసవీధిని పునరావృత్తము చేసుకున్నాడు.

* * *

అసలు...

క్షీరసాగరం కన్న...అతని పేరుప్రఖ్యాతి ముందువచ్చి వాలి నవి...ఆ ఊరు. యూరోపీయ విశ్వవిద్యాలయములలో మానస తత్త్వపరిశోధనలలో కొత్త తెరువులచూపి...డాక్టరు పట్టమును, ప్రశంసలను అందుకుని...జైత్రయాత్ర చేసి తిరిగివచ్చిన జ్ఞాన యోధుడు...రసైకజీవి... త్యాగశీలుడు...ఉత్సాహి. స్వదేశమున కాలుపెట్టగానే...దేశదాస్యవిమోచన-ఆవేశములో...గొప్ప పదవు లను ఆశించక...దొరతనము ప్రాపకమునులక్ష్యము చేయక...స్వలాభ చింతనలు మాని...దీక్షితుడై, నడుముకట్టుకుని అసహాయోద్యమ శ్రుతిలో, స్వేచ్ఛాగీతికాలాపనమునకు ముందంజ వేసిన ఉదారుడు. మాతృభూమికి...మళ్ళివచ్చినది—పాశ్చాత్య వేషముతో, ఆడంబర ముతో...అధికార దృష్టితో...దర్జాతో! కాలుమోపి...పరిస్థితులు అవగాహన చేసుకోగానే...హిందూదేశమంతా...అహంకారమును

నిరంకుశత్వమును స్వాహా అనివేసి చెలరేగుతూఉన్న సత్యాగ్రహ జ్వాలలు,—చెరసాలలను...వందలు వేలుగా, అలంకరించుతూవున్న స్వచ్ఛందులు...ధర్మనియంతలు,...కనబడి, కలవరపరచి...క్షణంలో మనసు పూర్తిగా తిప్పివేసింది—ఈ కరుణా-వీరదృశ్యము:

—కొలంబో రేవులో నే,... స్వదేశీదీక్షబూని, విలాయతీ వస్త్రదహనోత్సవంచేసి... అగ్నిసాక్షిగా వీరకంకణము కట్టుకొని... సన్నద్ధుడై ముందుకు ఉరికిన రాహుతు.

డాక్టరు క్షీరసాగరం...వస్తాడు, ఉపన్యాసం ఇస్తాడు...అన గానే...జనం తండోపతండములుగా విరగబడి పోవడంలో...విశే షము ఏమున్నదీ?

సాయంకాలము అయిదుగంటల రైలులో దిగాడు క్షీర సాగరం. అక్కడనుంచి సరాసరి, ఊరేగింపుతో టౌనుహాలుకు తీసుకు వెళ్ళారు. ఇనుకవేసినా రాలకుండా జనంతో నిండిపోయిన సభ. ఆనందకోలాహలములో... ఉపన్యాసవేదిని అధివసించి... మేఘగంభీర స్వరమున...మహోపన్యాస వాగ్ఝరిని చిత్రప్రవాహ గతుల వెలయించి... హాయ్ అనిపించి...ఉద్రేకం...ఫలోన్ముఖమై భావిభాగ్యోదయమునకు ఉపకరించే...సాధన ప్రణాలికను ఉపదేశిం చాడు...

పురజనుల కోరికెను మన్నించి... నాలుగైదు దినముల వరకూ అక్కడ ఆగిపోయి...తలపెట్టిన... కార్యక్రమమునకు దోవ చూపించి, సలహాయిచ్చి, మొదలు వేయడానికి...ఒప్పుకున్నాడు.

—కృష్ణస్వామిగుప్తకు అతిథి, క్షీరసాగరం:

ఉద్యమానికి సంబంధించేవారు ఎవరు వచ్చినా...పిన్నా పెద్ద లని కాకుండా...అక్కడనే మామూలుగా విడిది:

గుప్త...ఉద్యమానికి...ఆప్రాంతాలలో మూలాధారమైన... ప్రత్యేక అభిమాని. లాయరు. కొటకంరోజుల్లోనూ... ఏరెండు

మూడువందలో సంపాదించుకుంటూ, పెద్దలనాటినుంచీ, క్రిమాభి వృద్ధిలో ఉన్న ఖాతాతో... భాగ్యభోగములతో... మంచి ఫాయాగా బ్రతుకుతూన్న వాడు. వైశ్యుడే, కాని .. పీనాసి కాడు. పిరికి తనం ఏకోశమునా లేదు.

కృష్ణస్వామికి అన్ని విధాలా తగినభార్య కనకవల్లి. మంచి వర్చస్విని. కులమును నిర్ణయించడానికి తగిన ఆనాకారి పోలికలు ఏమిన్నీ లేవు. చక్కగా చదువుకున్నది. ఈదేరి...విచక్షణ తెలిసిన తరువాత అయినవివాహము.

—దేశమన్నా...దేశభక్తులన్నా ఆమెకు అపరిమితగౌరవం. కృష్ణస్వామిని పూర్తిగా స్వదేశీని చేయడంలో...బాధ్యత, ప్రతిష్ఠ... చాలావరకూ ఆమెదే. 'బాపుజీ, మనం...ఒక కులమేగా. ఆయన మాట మనమే వినకపోతే ఏలా ?' అని చలోక్తిసరసము లాడు తూండేది.

సమఉజ్జ్వలైన దంపతులు...భావాల్లో ప్రతిరూపులై...అర మరికలు లేకుండా సుఖంగా సంసారం చేస్తూన్నారు. పదిఏళ్లైనా... కడుపుఫలించలేదనేకొరత...ఒకటి ఉన్నా...ఆ విచారమును ఇతర వ్యాసృత్తులలో మరపించుకుంటూన్నారు.

—ఆయింటి అతిథి క్షీరసాగరం. ఉపన్యసించినప్పుడు అధ్య క్షత, ఆధ్వర్యమువహించిన కృష్ణస్వామే...అతిథేయ సత్కారము లాచరించే భాగ్యానికికూడా నోచుకుని...పొంగిపోయినాడు. భార్యా భర్తలు స్వయముగా కనుక్కుంటూ, క్షీరసాగరమునకు ఉపచారము లలో ఏలోపమూ రానీయడంలేదు. సలహాలకోసం...సంభాషించడం కోసం...వచ్చేపోయేవారికి విధి విరామములేదు. పవలు తీరిక ఉండటమే లేదు—

*　　　*　　　*

'పంచదార...చాలునా...కొంచెం కావాలా?'

...పరధ్యానంగా ఏదో యోజిస్తూ నిలుచుని...లాల్చీకి... గుండీలు పెడుతున్నాడు. ఒకమారు సిప్ చేసి, బల్లమీద ఉంచాడు కాఫీ. హఠాత్తుగా వినబడటంచేత...పోల్చుకోలేక కొంచెం ఉలికిపడి...ఎవరో...ఎక్కడ నుంచోకూడా గ్రహించకుండానే—

'నాకు షుగర్...ఎక్కువే ఉండాలి. అయినా...ఇప్పుడు... సరిపోయింది...' అని జవాబు రోదసిలోకి విసిరాడు.

'రావచ్చునా...?'

'ఓ...'

చేతిలో లాల్చీ మడత కుర్చీమీదవేసి, తువ్వాలు అందుకుంటూండగా...ద్వారానికి ఉన్న క్రోషాఅల్లిక తెరను తొలగించి కనకవల్లి లోపలికి వచ్చింది.

...లేత చందినం పొందూరు చీరె కట్టుకున్నది. అభ్యంగనం చేసి...తైలయోజనము లేకుండా సంస్కరించినందువల్ల... కైశ్య వస్తులు కాకుండా...చూర్ణకుంతలములు స్వతంత్రంగా పింఛ భ్రమణంచేస్తూ అర్ధపరివేషభ్రాంతిని కలిగిస్తూన్నవి.

...తడబాటు చూపులతో ఆకస్మికంగా అలా వచ్చిన... ఆమెనూ... తన దుస్తులు సరిగా ఉన్నవో, లేవోననీ... రెండు విషయములనూ ఒక్క చూపుతోనే కలగువేశాడు. మల్లెపూవంటి పోమాసుధోవతి సరిపింజెలతో విరిచి కట్టి...బనియాన్ వేసుకుని ఉన్నాడు. దువ్వకుండా వదిలివేసిన క్రాఫ్ గాలిలో, కదులుతూన్నది...

'ఎక్కడకు... ప్రయాణం?' అన్నది—సంకోచములేని, నిర్భయకలుపుకోలుతనంతో:

'...అలా వెళ్ళి...శారదామిల్సు పనివాండ్లతో...ప్రసంగించి వద్దామనుకుంటూన్నాను.'

అడుగు ముందుకు వేసి 'చంద్రశేఖర' అద్దంమీద ప్రాకుతూన్న సాలీడును ఊదేసి—

'డ్రైవరు యింకా రాలేదు. అదీకాక, మబ్బు బాగాపట్టింది. వానవస్తే తగని చిరాకుగా ఉంటుంది...' అన్నది.

'గుప్తగారు...ఎప్పుడు వస్తారు...కోర్టునుంచి...?' అని, ఒక ముహూర్తం నిదానించి... కాఫీకప్ అందుకుంటూ...అడిగాడు.

పరకాయించి...చూచి—

'నాలుగు...నాలుగున్నరకు వచ్చేమామూలు' అన్నది — ఏమిటి విశేషం...అనే చూపుతో.

'మూడైంది...ఇప్పుడు'

'గంట...గంటన్నరలో రావచ్చును. పని ఉన్నదా ?'

'లేదు...ఊరికేనే అడిగాను'

'మరిచాను...యీవేళ కొంచెము ఆలస్య మౌతుందేమో!'

'ఏమో ?'

'వచ్చేటప్పుడే ... ఏకంగా బజారుకు వెళ్ళి... రేపు పార్టీకి కావలసిన సామగ్రి తీసుకురమ్మన్నాను.'

'ఏం విశేషం...రేపు ?'

'రేపు...నా పుట్టినరోజు. ప్రతియేడూ పండుగగా...పార్టీ ఇవ్వడం మామూలు...'

'బాగున్నదండీ... ! వెనుక నేనూ ఇలాగ చేసేవాడిని'

'ఇప్పుడు...మానేశారా?'

'ఇంగ్లండులో...ఒకటి రెండుసార్లు చేశాను...తరువాత... యూరప్ ... తిరగడంలో ... క్రమేణ ఏమిటో అశ్రద్ధలోపడి పోయింది. అయితే,...ప్రెజెంట్లు పుచ్చుకునే ఆచారం...'

'నజరానాలు చదివించుకోవడం... నాకు అంత నచ్చదండీ. కాని, వచ్చేవాళ్ళు... వట్టిచేతులతో రావడమేమిటని... ఏమన్నా తీసుకువచ్చి, బలవంతంచేస్తారు. రేపు... చూద్దురుగాని. రేపు, ఏం .. అనుమానిస్తున్నారు?'

'బయలుదేరుదామని...'

'రేపా?... నా పుట్టినరోజుకు ఉండటం ఇష్టంలేకనా, లేకపోతే... ప్రెజెంట్ ఇవ్వవలసివస్తుందికదా అని... భయమా?'

'భక్తి కుదిరినతరువాత .. భయం ఎక్కడిదీ...?'

'అయితే... ఉంటారన్నమాటేనా?'

'ఆఁ...'

'... ప్రెజెంటు ఏమైనా తెచ్చినా... మీ రుణం ఉంచుకోను లెండి. మరోరూపాన... ముట్టజెపుతాను...'

'అలాగేం!'

—ఇద్దరూ... చిరునవ్వుతో, రెప్ప వేయకుండా... చూసుకుంటూన్నారు... మనసులో...

పోర్టికోలో... మోటార్ ఆగింది. హారన్... ! చివాలుమని గంతేసి నిష్క్రమించింది కనకవల్లి. చూపు త్రిప్పివేసుకుని... లాల్చి వేసుకోవడం మొదలుపెట్టాడు... క్షీరసాగరం.

*　　　*　　　*

మర్నాడు... సాయంకాలము నాలుగుగంటల నుంచీ, గుప్త గారి యింటివద్ద, కోలాహలం ప్రారంభమైనది. కారుల్లో... కోచ్‌ల్లో ... హాజరైనారు పేరంటాళ్ళు. నవ్వులు, కేరింతలు... సరసాలు, ఒకటేమిటి—హాలంతా రసపరాకాష్ఠను పొందింది.

పాడకతప్పదని బలవంతముచేసి ఒప్పించారు కనకవల్లిని, నెచ్చెలులు. సమ్మోదసాగరం... గానతరంగ సంక్షుభితము అయినది.

పక్కగదిలో నలుగురైదుగురు మిత్రులతో కలసి...వేడుకలన్నీ వింటూ ఆనందిస్తూన్నాడు...కృష్ణస్వామి. ఉన్నట్టుండి, క్షీరసాగరం...ఉలికిపడి—

'ఎవరో...పిలుస్తున్నారు...నన్ను' అని లేవబోయినాడు. అప్రమత్తులైన...ఇతరులు...గ్రహించి...బిగ్గరగా నవ్వారు. గుప్త కలత చెందకుండా—

'కాదండీ...క్షీరసాగరశయనా...పాడుతూన్నది, కనకం...' అన్నాడు. పొరబాటు తెలుసుకుని...కిక్కురుమనకుండా...క్షీరసాగరం...పాటవినడం మిషతో ధ్యానమగ్నుడైనాడు.

...ఆరుగంటలకు...హడావడి అంతా అయిపోయి...వచ్చిన వారంతా తిరిగి వెళ్లిపోయినారు. కృష్ణస్వామిని...క్షీరసాగరాన్ని పిల్చుకుపోయి...వచ్చినప్రెజంట్లు నన్నింటినీ సగర్వముగా చూపించింది కనకం:దంతం ఫొటోఫ్రేములు...ఎబనీ పిన్నులు...బ్రోచ్‌లు, —ఒకటేమిటి...వినోదాలంకరణములన్నీ కొల్లలైపోయినాయి. ఒకటొకటి అందుకుంటూ విమర్శగా చూస్తునారు...వాళ్లు.

ఇంతలో...టెలిగ్రాం వచ్చింది. గుప్త విప్పిచూసి... ఒకనిమిషం ఆలోచించి...తొందరగా—"మెయిలుకు వెళ్ళాలి. మళ్ళా రేపు రాత్రికి తిరిగి వస్తాను..." అని ప్రయాణ మౌతూ క్షీరసాగరాన్ని...తాను వచ్చిన తరువాత వెళ్లవచ్చునని...ఒప్పందము చేయించి...బయలు దేరాడు.

కారులో...స్టేషనుదాకా వెళ్ళి...గుప్తను దించి...బాగా చీకటిపడేదాకా షికారు తిరిగి...యింటికిచేరుకున్నాడు,క్షీరసాగరం. కనకవల్లి...ఏదోపనిలో ఉన్నది కాబోలు...కనిపించ లేదు. కారు రాకనైనా గ్రహించలేదేమో. క్షీరసాగరం...తనగదిలోకి వెళ్ళి దుస్తులు తీసివేసి...ఫేన్ తిప్పి...'మైండ్'... నూతన సంచికను చూడ్డం ఆరంభించాడు.

తొమ్మిది! ... చదువుతూ...ఆధోరణిలో...వేళే మరచి పోయినాడు. లేచి ఇటూ అటు...పచారు చేసి...కిటికీ దగ్గరగా నిలుచున్నాడు. సుమపరిమళంతో...భావనలన్నీ మధురించినవి. ముఖమల్ మీద ముత్తెపు పనితనము మెరయించేలాగు...చుక్కలు... మిరుకుమంటూ...వింతవింత కిరణాల రంగుల మొనలు చాచుతూన్నవి...!చల్లని...పులకలు రేకెత్తించే...గాలి...!

—చప్పున...ఏదో జ్ఞప్తికివచ్చి...పెట్టెతెరచి ఓ పేకెట్ బయటికి తీసి, యోచన ప్రారంభించాడు. హాల్లోకి వెళ్లి...కాల్ బెల్ నొక్కి...తటాలున తన గదిలోకి తిరిగి వచ్చేశాడు. వెనువెంటనే...కనకవల్లి తొందరగా...ప్రవేశించి... 'ఎవరు ?'... అని కలయజూచింది...హాలంతా.

'నేనేనండీ...పిలిచింది' అన్నాడు గదిలోనుంచి క్షీరసాగరం.

'ఎందుకండీ... ?' అని...ఎదుటవచ్చి నిలిచింది.

ఇందాక...ఇవ్వడం మరచిపోయినాను. మరి...నా ప్రెజంట్... ' అని కొంచెం బిడియంగా అన్నాడు.

'ఆఁ...నిజంగా...ఏమన్నా పట్టుకువచ్చారా ఏమిటి ?... నేను నిన్న అన్నాననా... ?'

'లేదు... లేవాలనే...'

'అయితే...ఏదీ? '

...పేకెట్ అందించాడు. పై కాగితము తీసివేసి...చిన్న పెట్టెను తెరిచే సరికి తళతళలాడుతూ... వెండిగవ్వలు !

'ఏం చక్కగా ఉన్నాయండీ, పందెపు గవ్వలు !— ఇంకెప్పుడూ... వీటినే ఉపయోగిస్తాను...' అని, చిన్నపిల్లల బులబాటంతో... చేతులో గలగలలాడించి...పొంగి పోయింది.

క్షీరసాగరం ... ఆమెనూ ... మాటలవైఖరినీ ... రెప్ప వేయక గమనించుతూన్నాడు.

'ఇవాళ ...వచ్చినవాటిలోకల్లా ఇవే చాలా బాగున్నవి... నాకు...'

'నిజంగానా...?'

'ముమ్మాటికీ!'

'నిన్న సాయంత్రం...షాపుకు వెళ్ళి... తీసుకువచ్చాను. మరేం మంచివి కన్పించలేదు. ఏదో, తోచింది...'

'చాలు, వ్యాఖ్యానమెందుకూ?'

'...మరిచిపోకుండా ఉంటే...చాలు'

'ఎవరినీ?... గవ్వలనా...మి...మ్మ...ల్నా...?'

'రెండూను...'

'మీ బాకీ...ఏలా తీర్చుకోను?'

'ఏం బాకీ...?'

'ఈ ప్రెజెంట్...'

'ఓ...ఇదా...మరేమో అనుకున్నా...'

'మీరు...భోజనం...మరి'

'చేయలేదండీ...! టిఫిన్...చాలా జాస్తి అయిపోయింది. మీరో...?'

'డిటో!...కొంచెంసేపు...మిద్దెమీద కూర్చుందామా... ఇంత కంటె చల్లగా ఉంటుంది. ఇక్కడ ఉక్కపోయడం లేదూ?'

'ఫేన్...'

'ఉన్నామాత్రం...?'

'ఫర్వా...లేదు...'

'అయితే...'

—కరెంట్ ఫెయిలై దీపాలు ఆరిపోయినవి. మాటలు... గుసగుసలు...ఏమీ నిశ్శబ్దమును భంగపరచలేదు. కాని, ఒకరి నొకరు... తాకినట్లు...విదిలించుకున్నట్లు...

.. నాలుగైదు నిమిషములలో లైట్లు పునరుజ్జీవితములైన తరువాత— ఆయన ముఖాన విసుగు,.. ఆమె కవళికలో ...నిరాశ.

* *     * *     * *

అంతే...

వెండిగవ్వలు...

నెలతప్పిన...కబురు తెలియగానే...లోకులు పరిపరివిధముల ...నీలాపనిందలువేసి ఉంటారు. ఏమీ లేకుండానే...రవంత సందుదొరికితే ఆడిపోసుకోడానికి కాచుకుని ఉండే కాకిమూకకు... ఇంకా అంతకన్న నిదర్శనం ఏమి కావాలి?...కనకం...ఎబ్బెరికం లేకుండా...మొగవారితో కలసిమెలసి తిరగడం...అందరూ ఎరుగున్నదే కాదూ...? క్షీరసాగరంలాంటి...అందకాడు...మాంచి వయస్సులో ఉన్నవాడు...వచ్చి వారియింట్లో మకాం చేయడం,—ఆరోజుల్లోనే సరిగా...గుప్తకు ప్రయాణం తగలడం...ఏది ఏలా ఉన్నప్పటికీ...పాపమోపుణ్యమో అనుకుని ఊరుకోడానికి వీలులేకుండా... అంతకాలంనుంచీ కాపురంచేస్తూన్నా...లేనిది...కడుపు ఫలించడం,- అనక ఎందుకు మానుతారు?— సందేహపు హద్దు...మీరి పోయిన...ప్రత్యక్షప్రమాణం...స్పష్టంగా కానుపించుతూ ఉండగా?

కృష్ణసాగరం...సాగరేశ్వరి...

తీరక...మనసులోనే...మొలకలెత్తిన కోరికలు భావనా యోగమున సిద్ధించినప్పుడు ...పోలికలుమాత్రము...ఎక్కడకు పోతాయి...? ఎంతసహృదయుడైనా...కనకం వర్తనలో...లోటు ఏమీ వుండదని ఎంత నమ్మకంఉన్నా...లోకుల ప్రవాదలను

లక్ష్యము చేయని ధీరుడైనా...కృష్ణస్వామి...ఆ ప్రతిబింబములను చూసినతరువాతకూడా...కళంకమును ... శంకించకుండా... శాస్త్ర మర్యాదను పాటించుకుని...సమన్వయంచేసుకోగల స్వాస్థ్యం ఉంటుందా?...వెనుకటిగౌరవం ఉంచి...ఆమెనుమన్నించుతాడా?... ఏమో... ?

కాని...ఏపాపమూ ఎరుగని... కనకం...వీటిని లెక్క చేయదు. అంత నిబ్బరం ఆమెకు ఉన్నది. ఆలాటి వీరరమణులకు లోకముతో...ఏమిపని?... ఎవరు ఏమనుకుంటేనేం?...సరిగా అర్థంచేసుకోలేకపోతే... కృష్ణస్వామిది లోపం. ఆమెకు సహచరుడుగా ఉండటానికి...అతడు...తగడు.

కనకం...

వంచన లేమీ ఎరుగని...అమాయకురాలు...! మాయ చేసి...లోబరచుకొన యత్నించలేదే...! పుంశ్చలీ భావమున... అతిధ్య విధులకు హాని చేయలేదే...! మాతృత్వసిద్ధికి...లక్ష్యముగా మానసపూజ చేయడం...అపచారము ఏలా అవుతుంది...? పశు కామన లేమీ లేవే...? కళంకిత కాలేదే...! ఆ ధన్యజీవి...సాఫల్య సమ్మోహనమునకు...క్షీరసాగరం...సాంఖ్య మర్యాదను ఉపకరించడంలో...దోషము...ఏమీలేదు... లేదు...

కవలు...కనకం...వెండిగవ్వలు...

వెండి...గవ్వలు...!

* * *

* * *

—వచ్చేశాడు...

ఏకధాటిని, ఎక్కడా ఆగకుండా సందుమొదటికి వచ్చి... వంతెన అంచున కాలు ఆనించి ఆగిపోయినాడు. అట్టే పొద్దుపోక పోయినా...ఆవైపు అప్పటికి అప్పుడే మాటుమణిగింది. పండ బారిన వెన్నెలమూలాన కుపథమైనా, రాజమార్గాన్ని ధిక్క రిస్తూన్నది...

ఒక కాలితో పెడల్‌ను గిక్‌మనిపిస్తూ...ఒక్కక్షణం అనన్యాయత్తమైన నిశ్చలవీక్షణముతో నిరీక్షించాడు; సిగరెట్‌కు, నిదానంగా అంగారలేశసంయోగాన్ని అనుగ్రహించి, చిలవలపలవల తెల్లని పొగ లేదీవలను అలసంగా కమ్ముకోనిస్తూ...వెక్కిరించే చుక్కల మిణుకును లెక్కసేయకుండా...కదలకుండా, ఆలాగే కాచు కుని ఉన్నాడు.

కాని—

ఏమనుకున్నాడో...లాభంలేదని తోచిందేమో...సైకిలును ఓరగించి...తొక్కాడు. వేగభంగానికి చూచాయగా బ్రేక్ వేస్తూ ఆ యింటివైపే చూస్తూ, దాటిపోయినాడు. తిన్నగాపోయి, మలుపు తిరిగి రోడ్డుమీదకు వచ్చి...దిగకుండానే నిమ్మదిగా ఎగువకుపోయి మళ్ళా వెనుకకు తిరిగి...యథాస్థానానికి చేరుకున్నాడు. ఆగదలచు కున్నాడేమో...కాని, నడుపుకుంటూనే వచ్చి, ఆ యింటిదగ్గర... అక్కడ...ఆగిపోయి, సైకిల్‌ను స్టాండువేసి నిలువనిచ్చి...

పెడల్‌ను ఊతంగా తొక్కాడు. బంయ్...య్...జ్...జ్...—హబ్‌మోత్రితో వెనుకచక్రము స్పోక్సు అన్నీ ఏకంచేసుకుని, వేగంగా తిరుగుతున్నది...తిరుగు...తూ...న్న...ది.

—ఆగిపోయింది. ఒక్క-నిమిషం ఊరుకున్నాడు. ఎక్కడా అలికిడి లేదు...సిగ్నల్ అందనందువల్ల! మళ్లా రెట్టింపు సత్తువతో... బం...య్...

ఎదురుగుండా...పైన...మేడమీద కిటికీతలుపు చిరుగాలికి లాగ, కొంచెం ఎడమైంది; క్రమంగా ఓ రెక్క తెరుచుకున్నది. జుట్టు...నుదురు, కళ్లు, పెదవులు, నవ్వుమొగం, కనబడి...తళుక్కున వెనుకకు వాలిపోయింది...

—సిగరెట్ కొడి కేరమ్సముద్రితో రాల్చి...దమ్మునిలిపి, అగ్రిన్ని కెంపులాగ మూడుసార్లు మెరిపించాడు. ఉహుం... జవాబు లేదు.

ఎత్తినతల వంచకుండానే ..తెలియకుండానే...మళ్ళా పిల్చబోయినాడు. వేలి అంచులకు చురుకు తాకి మెలకువ వచ్చింది. స్టంప్‌ను, సవిమర్శగా పరిశీలించి ఉడ్చి నేలకు వేసికొట్టాడు. రవ్వలు చిందినవి కాని కూటాన్నికి భంగము రాలేదు.

కొత్తసమిధితో...తిరిగి ధూపారాధన...

—సగం కాలిపోయింది...ఉద్వేగంతో పొగలు గ్రుక్కుతూండటం చేత...

అప్రయత్నంగా బెల్ మీదకు వెళ్ళిన చేతిని మానసబోధతో మరలించుకున్నాడు. కాని, అరవంత తొకుడు మిషతో, సైకిల్ కాలు నిలుపలేక ఒరిగి పోయింది....నిశ్శబ్దాన్ని ధిక్కరిస్తూ...! కలవరపడుతూ, సరిచేదామని వంగి...బార్‌ను గ్రహించబోతూ... వెలుతురు, మీదవాలగా, అమాంతే అంతలో మరచిపోయి... నిలువబడి పోయినాడు.

కిటికీ రెక్కలన్నీ తెరుచుకుని ఉన్నవి. లైటు ఉన్నది. ఆ అమ్మాయి...తల ఊగించింది: చెయివిసిరాడు. కళ్ళు...ఉభయంగా...ఏమో తలపులు చూపులుగా విసురుకున్నవి. మళ్ళా, లోపల చీకటి...!

సైకిల్‌తో ముందుకు నడిచాడు. గోడకు ఆనించి...వేసి సరసను ఉన్నతలుపు నెట్టాడు. గడియవేసి ఉన్నది: ఇంకో సిగరెట్‌తో...మరో అయిదు నిమిషాలు వేగిరించి, మళ్ళా...

ఈమారు తలుపు...వచ్చేసింది. బెదురు లేకుండా లోపలకు ప్రవేశించాడు. మొదట ఎవరూ కనబడలేదు. కాని...వెంటనే, జాజిపొదమాటున...ఎవరువారు?

ఆమె తల్లి...

—చిక్కిపోయినాడు...! వెనుక అడుగు వేయడానికి వీలులేదు...! ధైర్యంచేసి వేద్దామన్నా, పడదు.

'సిగ్గులేదూ. ఎన్నిమాట్లు చెప్పాలి? మళ్ళా...బ్రాహ్మణులు...చదువుకున్నవారు...'

అతడు ఏమీ మాటాడలేదు: ఆశ్చర్యపడుతూ...ఆమెవంక రెప్పవేయక చూస్తుండగా...

'ఈ చాయలకు రావద్దనలేదూ? మర్యాదగా చెపితే వినేటట్టులేదే...!

—భయం తీరుతూన్నది...కాని, ఇంకా గొంతు స్వాధీనం కావడంలేదు.

'సాని అనుకున్నావా?...మా యిల్లు నడిబజారు అనుకున్నావా?'

'సాని అయితే...నాకెందుకూ?'

'కావాలంటే మాత్రం తేరగా ఉందనుకున్నావేం? వృత్తి చేయించవలెననుకుంటే...నీతాతలు...'

'నేను...'

'ఇక, మాట్లాడబోకు...! మాపిల్లకు, మాకు, ఇలాటి వేషాలు సరిపడవు: మేమూ ఘనంగానే బ్రతుకుతున్నాం. పెళ్లి చేయాలనుకుంటూన్నాం. ఎవరన్నా చూస్తే...ఇంకేమన్నా పరువు దక్కుతుందా ?'

'పోనీ... నేను కాకపోతేమానె...బంగారంలాంటి పిల్లను... పెళ్లి చేసి చెడగొట్టవద్దు'

'ముందు...నడు...అవతలికి'

'మీకు...డబ్బు కావలసి ఉంటే...'

'నడు...'

—దూరంగా, గుమ్మంలో, ఆ అమ్మాయి నిలుచుని... తల్లికి కనబడకుండా...వెళ్లిపొమ్మని సైగచేసింది—

నిలకడతో అడుగులు వేసుకుంటూ తాపీగా బయటికి వచ్చేశాడు. మాత, సణుగుడు రొదతో తలుపు ధణీమని వేసేసింది.

కిటికీక్రింద...తలఎత్తి చూశాడు...అభ్యాసక్రమాన...

...వెలుతురు...! ఆ అమ్మాయి దరస్మితమధురాననం... కనుసైగలో...ప్రణయామృతం...అభయం...

* * *

కొన్నాళ్లకు...

—ఒత్తుగా పెనవేసుకుని వాలిపోతూన్న తీవెలు...వర్షధారలు :

రకరకాల శృతులలో...రంయ్...రం...య్...ప్రధానంగా గాలి హోరు...కటికచీకటి.

పదకొండు కావచ్చింది...

...జట్కా, తోట గుమ్మందగ్గరకు వచ్చి ఆగింది. గుర్రము, తల విదిలించుకుని సకిలించబోతూండగా గాడీవాలా వెన్నుతట్టి ఆపి, కమ్చీ అంచుతో టాపులోపల బద్దలు...రటరట లాడించాడు.

గుమ్మంలోనుంచి...ఎవరో వచ్చి...బండిలోకి ఎక్కినారు. మళ్లకుండా సరాసరి సాగిపోయి...మలుపుతిరిగి రోడ్డు ఎక్కింది, జట్కా. అక్కడ ఇంకొకటి కలుసుకుని...రెండూ దౌడా యించినవి...

ఖాళీబళ్లు తిరిగి సగందూరము వచ్చినతరువాత మెయిల్ కూత వినబడ్డది.

*　　　　*

ఊరంతా గుప్‌మన్నది—శుద్ధ సనాతన దీక్షాపరుల వంశాంకురం ... కుమారస్వామి...కన్నెరికం కాని సానిపిల్లను...తల్లికి తెలియనీకుండా, లేవదీసుకు వెళ్ళిపోయినాడని!

'అసాధ్యుడు...మహా మజా అయినపని జేశాడు. ఆరి...పిడుగూ! మాకు తెలియనిస్తే...షాబాష్‌గా సెండాఫ్ ఇచ్చే వాళ్ళమే...బలే...'

—అని మిత్రులు...సన్నిహితులు అయిన నవ్యాంధ్ర కవి రసికులు:

'కలికాలం...కలౌపంచ సహస్రేషు...! ఇంకానం నిదర్శనం కావాలి? వంశమర్యాద...పరువు, ప్రతిష్ఠ గంగలో కలిసిపోయి నవి; శాంతం పాపమ్...రా...మ...'

—అని...ఏ కోరికలూ తీరని—ఏ సరసానికీ నోచుకోని... శుద్ధ నిర్గుణమూర్తులు...వ్యవహారసనాతనులు.

'వీళ్ళకు ఇదే పోయేకాలం: గొప్పకులంవాళ్ళ మనుకుంటూ ... ఈ జాతి అంతా ఇదేరకం! సానిపిల్లను, తేరగా తన్నేసుకు పోదామనుకున్నాడు...! ఈ శాలువల శాస్త్రిలగార్లంతా ఏంచెప్పు తారో కనుక్కుంటూ, పురాణం దగ్గర పట్టుకుని దులపనూ?... పోలీసులకు చెప్పనూ? నే నెవరనుకున్నాడో!... నా పిల్లను పువ్వులలోపెట్టి, తీసుకువచ్చి అప్పగించకపోతే...'

—అని...ఆ అమ్మాయి తల్లి: అసలా...కులమువారు అందరూను.

'మాకన్న తండ్రికి...దేశాలు పట్టుకు పోవలసినగతి ఏం వచ్చింది? నేనేమున్నా వాడి మాటకు కాదంటానా? ఊరివారం దరూ...తనకు పెట్టి పోషించుతున్నారా, వాళ్లకు భయపడి పరారి కావడానికి? కులం ఏమైతేనేం...మానాయునకు నచ్చిన పిల్ల గుణ వంతురాలే...! కోడలిని చూసుకునే ముచ్చట నాకు మాత్రిం ఉండదూ? ఎప్పుడు వస్తారోకదా!...మళ్లా కంటికి ఎప్పుడు అగపడు తాడో...'

—అని...ఆతని తల్లి.

* * *

ఏ దేశాలు తిరిగినా...ఎక్కడ అజ్ఞాతంగా కాలము గడపు కున్నా,...మధుమాస వికాసములో, కోయిలలు మళ్ళిరాక... కో యనక... తప్పుతుందా?

'లోకముతో మనకేటికి' అనో...మరి వాళ్ల ఆలోచనలు ఏమో,...ఆ పావురాజంట తిరిగీకూటిలో వాలింది..

స్వగృహము...సలక్షణముగా కలకల లాడిపోయింది. సంగీతాలు...సరసోక్తులు, చెలరేగినవి. సనాతనులు ఆత్రోవను నడవటం మానివేశారు. కాని చూడవచ్చే,...అభినందించి...కూడా ఆనందించాలని వచ్చే స్నేహితులతో...ఎడా తెరిపీ లేదు.

—వర్ణాంతర సంయోజనమైనా...విధ్యుక్త వివాహమేనని, కొందరు అమాయికులు: గాంధర్వము ప్రిధమ చరణముని...మరి కొందరు సరిపెట్టుకుని పోయే...మధ్యములు: అవేవీకావు ..ఇంకొకటి, ఏమిటోనని...అవరులు!

కాని, ఎటు ఆలోచించినా...దంపతులేనని అందరూను.

అసలు సంగతి మాత్రిం...ఎవరికీ తెలియదు.

* * *

ఇంకా...కొన్నాళ్లకు—

...ఎండ తగ్గినా...ఉడుకు తరగలేదు. పొద్దుగుంకుతూన్నది. వడగాడుపుల తెరలు...అలలై పోతూనే ఉన్నవి. తేరుకునేందుకు...వీలుకా లేదు...

—ఎవరో...పిలిచారు. స్వామి తల్లి వెళ్లి తలుపుతీసి, అడుగు వెనుకవేసి...గుమ్మానికి పక్కగా ఒత్తిగిలగా...

'ఉన్నారా...మీ అబ్బాయి!' అని...వచ్చిన ఆయన ప్రశ్న.

'ఆఁ...వచ్చి...ఆలా కూర్చోండి నాయనా...పిలుస్తాను'... అని, ఆప్యాయనంగా...ఆ అమ్మ ఆహ్వానం.

'రండీ!' అంటూ, వెనుకకుతిరిగి హెచ్చరించింది...వెళ్లిపోతూ. ఆయనా...వెంటవచ్చిన ఆమె...ప్రవేశించి, ఆసీనులైనారు.

ఈ అపరిచితులు ఎవరో ఊహించలేక...స్వామితల్లి... అక్కడ నిలువలేదు.

మరి...పది నిమిషాలకు...

సావడిలోకి వస్తూ...మాటలు వినబడగా స్వామి...వసారాలో ఆగిపోయి, ఆలకించడం మొదలుపెట్టాడు:

'పాత కుండను...పాత...కుండను...'

నవ్వుకుంటూ చక్క వచ్చేశాడు...చూశాడు: గుమ్మంలో కాలు ఆలాగే నిలిచి పోయింది.

—సోఫాలో, శివిగా...ఆ అమ్మాయి తల్లి: దివాసీ మీద మోకరిలి...అభయ ముద్రిలతో...ధ్యానమగ్నుడై, ఉపాసనలో మునిగి తేలుతూన్న...రామమూర్తి పంతులు!

'దేవా...నేను, పాత...కుండను: నీవు, ఉత్తముండవు... నీవు, ఉత్త...ముండవు...'

...దిగ్గరగా సవ్వేశాడు. ఆ నైష్ఠికుడు, మిగతా ప్రార్థన కొంచెం తగ్గుస్థాయిని పూర్తి చేసి,...బ్రహ్మ కృపాహి కేవలమ్... అని, అంచెలంచెలుగా రెప్పలు విప్పి...లేచి నిలుచున్నాడు.

'నమస్కారం...పంతులుగారూ...'

'ఆఁ,..ఆఁ...! మీతో ఒక...ముఖ్యవిషయం...'

'ఆలాగా ...దయ చేయండి.పెద్దలు ... నిలువబడి ఉండటం..'

'పడక కుర్చీలో, బలవంతం చేయించుకుంటూ...కూర్చు న్నాడు, పంతులుగారు : స్వామి...బాకింగ్ ఫ్రెర్ లో కుషన్ లు తలకు అమరికగా సర్దుకుని...ఊగుతూ...సంసిద్ధుడైనాడు.

ఆగంతుకులు...మాసముదాటిలంకారులు. ఈవాలకిం కని పెట్టి...ఇక ఊరుకుండ లేక, స్వామి, ఆమెను చూపులతో గిలి గింతగా...

'...ఏం...కులాసాగా ఉంటున్నారా?' అని, బంధుప్రేమ ఉట్టి పడుతూండగా పలుకరించాడు. ఆమె...చురచురజూసి, మూగ నోము విడువకుండా, తలతిప్పుకున్నది ; ఆయన... పెదవులు కదప బోయి, ఊరుకున్నాడు.

—స్వామి, లేచి గుమ్మందాకా వెళ్ళి, లోపలకు...సైగ చేసి, మళ్ళావచ్చి కూర్చున్నాడు.

'ఫరవాలేదే...అమ్మా...ఏంభయం ?' అని, దిగ్గరగా... లాలనతో బ్రతిమాలుతూ...రంగనాయకిని చేయి పట్టుకుని నడిపిం చుతూ స్వామి తల్లివచ్చి, ఆ అమ్మాయిని వదిలేసి...క్రింద కూర్చు న్నది.

'రా...రంగా...ఇలా కూర్చో' అని స్వామి...ఆమెనుచూసి, నిలుచుని పిలిచాడు : వచ్చికూర్చున్నది ఆ పిల్ల.

'అమ్మా !... '

—స్వామీ, పంతులుగారూ, పరస్పరావలోకనమునకు స్వస్తి చెప్పి... 'అమ్మ' వేపు చూశారు: వెన్నా... పక్షులూ... ఎగురుతూ దుఃఖాభినయారంభమును సూచిస్తున్నవి.

రంగనాయకి, తల్లి పరసను... వాలింది ... వేసి ముఖం తనవేపు మళ్ళించుకుంటూ... అమ్మా ... అమ్మా గాద్గదికముతో పిలిచి... బ్రతిమాలింది.

—ఒకరినొకరు... పెనవేసుకున్నారు.

'మా తల్లి... మళ్లా... కనబడతావనుకోలేదు...' అని వెక్కి వెక్కి... మరీ అదుముకున్నది.

రంగ, సిగ్గుపడుతూ, నవ్వుతో, వదిలించుకుని కొంచెం ఈవలికి జరుగుతుండగా...

'చూడండి... కన్నుల కరువుతీరా...' అని, స్వామి చిలిపితనం చేశాడు.

అందరూ... నవ్వుకున్నారు.

మళ్లా— మౌనం...

'ఏం... ఎవరూ మాట్లాడరేం?... విశేషాలు ఏమిటి...? పంతులుగారూ, మీరుకూడా బిడియపడితే ఏలా... వచ్చినపని...'

—అని, స్వామి అంటూన్న మాటల ధోరణిలో దిటవు తెచ్చుకుని... పంతులుగారు,

'రంగనాయకి...'

మాటకు అడ్డంతగిలి... స్వామి—

'రంగను... చూడటానికి వచ్చారా? శుభం...! నిత్యమూ దయచేయాలని... మనవి: మేమే రావాలనుకుంటూండగా...తీరడం లేదండీ...! మళ్లా, ఊళ్లో ఉండమనుకూడానా...'

'ఎక్కడికి... ప్రయాణం... అడగవచ్చునా?'

'ఓ... దాపరికం ఏమీలేదు... కలకత్తా ?'

'ఎందుకూ ?'

—రంగనాయికి తల్లి... చెంగున లేచి... ముందుకు వచ్చి... గగ్గోలుగా...

'వీల్లేదు... ! రంగను... మేము తీసుకు వెళ్లి పోతాం... ! రా అమ్మ,... లెండి పంతులుగారూ...'

—స్వామి... ఏమీ చలించకుండా...

'అవశ్యం. ఎంతవాళ్లకైనా పుట్టింటి అపేక్ష ఉండదూ ? ఏం... రంగా...' అని కొంటె అయినాడు.

'నేను...రాను' అన్నది ధైర్యంగా, రంగ.

'రావూ ..'—నూతనులు ఇద్దరూ ఐక్యకంఠులై సంభ్రమించారు.

'ఊహుఁ..'

'రాక.. మరి'

'ఇక్కడే...అన్నయ్యదగ్గర ...ఉంటాను'

'అన్నయ్య! ...ఎవరు ?'

—రంగ ... స్వామివంక కరవుతో చూసింది. స్వామితల్లి నవ్వింది.

పంతులుగారు... తెల్లబోతూ...

'ఇంత పాపం...నాయనా...తగదుసుమా'

—స్వామి, లేచి నిలుచుని, వివేకానందవైఖరిలో...

'పంతులుగారూ ! మీకు యీ విషయం ఏమీ తెలియదు. ఇలా అన్నానని అన్యథాభావించకండి. పాపం...కుర్రవాడు...అక్కరకు రావలసినవాడు వృథాగా చెడిపోతున్నాడని...నీతిబోధకోసం,

మేము ఇద్దరం ఉల్ ఫాగా ఉండిపోయి, కళంకితుల మాతూన్నామని, ఉద్ధరించాలని...వివాహంచేయించి చూసి సంతోషిద్దామని... లేక పోతే నచ్చచెప్పి, పిల్లను వాళ్ల తల్లికి అప్పగించుదామని...దయ చేశారు, అవునా... ? తమలాంటి ఉత్తములకు వృధాగా శ్రమయిచ్చి నందులకు...మన్నించాలి. ఈ నిమిత్తాన అయినా గృహ పావనం చేసినందుకు...మీ దర్శనాలాభ భాగ్యము లభించినందుకు...ధన్యుణ్ణి కాని, మీరు అనుకున్న పాపాలు...ఏవీ... మేము చేయ లేదు... చేయ లేము... ! '

' అమ్మాయ్... కాఫీకలిపి తీసుకురా...అమ్మ'—అని స్వామి తల్లి, రంగను లోపలికి పంపింది.

'—శ్రీమన్మహాదేవుని ... అక్కడనుంచీ ఎత్తుకుంటాను... కథ...

' ...ఓనాడు...జోరుగా సైకిల్ మీద వచ్చేస్తున్నాను, వీళ్ల దోవను. హాయి అయిన సంగీతం వినిపించింది: ఆగాను...! ఆయిల్లు ఎవరిదో తెలియను...అప్పుడు...

' పాట వినడానికి...వీలైతే, ఆగానమోహిని ఎవరో చూడ టానికి...వీలు ఉన్నప్పుడల్లా... పోనీ వీలుకలిగించుకునే అనండి... అటే రావడం మామూలు చేసుకున్నాను...చూశాను.

' మధ్యమెట్లు వదిలేసి ... పైకి దూకుతున్నాను—ఆ గొడవ అంతా మీకు వివరించడము అనవసరం గనుక ... '

' పరిచయం, ...తరువాత స్నేహం ...అంటే అపోహ పడ కండి, వాత్సల్యం...ముదిరినవి. ఇద్దరమూ, తరుచు కలుసుకునే వాళ్లం: ఆమె చక్కదనం ..సంగీతం నన్ను పరవశుని చేసినవి. తోబుట్టువులకు నోచని కొరతను ...రంగ తీర్చింది. '

—అంతలో... రంగ కాఫీ తీసుకువచ్చింది. పొద్దుగూకి మసకదేలడంవల్ల... స్వామి పెద్దలైట్ వేసి ..టీపాయ్ మధ్యకు జరి

పాడు. ఓ గుక్కెడు పుచ్చుకుని, సిగరెట్...అనుమతిమీద... ముట్టించి—

'నేను...అబద్ధమాడుతున్నానేమో నని.. నా ,మాటలు మీరు నమ్మలేకుండా ఉన్నారుకదూ; కాని...నిజం...

'మరి,...చెల్లెలు వరుసతోనే అయితే...ఇంత రహస్య మెందుకు...విపరీతవర్తన మేమిటికని మీకు సంశయం తోచవచ్చును! అయితే, మీరే చెప్పండి, సాని యింటికి...అమ్మా, మీ కులధర్మ మును నిందించడంలేదు,—సోదరప్రేమతో వచ్చానంటే...మన్నించి రానిస్తారా...'

'మేము మాత్రం మనుష్యులంకామా...మంచిచెడ్డలు తెలియవా...తల్లికడుపున పుట్టలేదా?'—అని, రంగ తల్లి గింజుకున్నది. స్వామి, అది వినిపించుకోకుండా...

'మీరు...పెళ్ళి చేస్తారని, రంగ కన్నీటితో చెప్పింది. కులంలో ఖ్యాతి కోసం ఆ అమ్మాయి జీవితాన్ని...'

'ఏం...కానిపనా...మేము కష్టాలన్నీ అనుభవించాము కనుక, పిల్ల ..ఈ వంచనలన్నీ లేకుండా ఒక యింటిదై సుఖపడుతుందని...'

'అవును...రంగ మాత్రం...కాదని, మహాశ్వేతనై పోతానన డంలేదే...? ఎప్పటికో...ఇప్పుడు మాత్రం కాదు. ఒకయింటిది అవుతుందిలెండి—ఈ అనర్ఘమణిని సింగారించుకొనే అర్హుడు లభించి నప్పుడు...

'నేను...సజావుగా ఎంత చెప్పినా, మీరు వినేవారా... అర్థం చేసుకునేవారా? వినరు...కనుకనే రంగ, నేను ఆలోచించే ఈపని చేశాము. ఇంట్లోనే ఉంటే, ఈపాటికి మీకు నచ్చినయింట్లో పడి...తాపత్రయాలలో మునిగి తేలుతూ ఉండేదే...

'లోకంతో, నాకు...మాదృశులకు పేచీ ఎన్నడూ వుండనే ఉన్నది. అయినదానికీ, కానిదానికి ఎవరు ఏమన్నా ఎందుకు లక్ష్యం చేయాలి? ప్రతిఘటించవలసిన అవసరం వస్తే నా...పెద్దల అనుగ్రహాన...అర్ధ-అంగ బలములకు...ఏమీ లోటు లేదు...

'రంగా, నేనూ...కళాతీర్థములు అన్నీ సేవించుకుని వచ్చాము. చక్కదనం అంటే ఏమో,...లోకంలో...ఎన్ని ఛాయలు తిలకించుతున్నవో...ఈ అందాలరాశికి అర్థమయింది. ఏమి కావాలో, ఏ కోరికలు తీర్చుకోవాలో...తెలుసుకున్నది. ఇంకా నేర్చుకుని, మెరుగులు దిద్దుకుంటుంది...! సంగీతం...అభినయం...కలకత్తాలో...

'మరి...తాను ఏరి కోరిన ఆతన్ని...గాంధర్వాన వరించి ధన్యుణ్ణి చేస్తుంది : ఆమె యిష్టము...మన మెవరం నిర్ణయించడానికి? ఏం...తమరు అంగీకరిస్తున్నారా అండి ?'

పంతులుగారు, లేచి, అమాంతము స్వామిని కౌగలించుకున్నారు. రంగ తల్లి... కళ్లనీళ్ళకు అడ్డువిడిచి, ప్రాంజలి అయి నిలుచున్నది.

—'నాయనా...ఇక నేను వెళ్ళి మడిగట్టుకుంటాను... బంధువులు ఉన్నప్పుడు పొద్దుపోనీయడం ఎందుకు ? రంగా...ఇలా రా...' అంటూ స్వామి తల్లి ఇక కొలువు చాలించాలని సూచించింది.

'నన్ను...క్షమించాలి...నాకు...పనిఉన్నది...'— అంటూ పంతులుగారు మొగమాట పడబోయినారు.

'నేనూ...—' ఆమె తల్లి...మొగం చెల్లక తప్పించుకోవాలని చూసింది.

స్వామి...నవ్వుతూ...

' లాభం లేదు...తప్పించుకుందామనుకుంటూన్నారేమో...! ఏమన్నా...అంత మించిపోయేపనులున్నా, రేపటికి వాయిదా వేసేసుకోవాలిసిందే. మీరు...రాత్రికి యిక్కడే ఉండిపోతారని... చిన్న పిల్లలు తప్పిపోయినారేమోనని పెద్దవాళ్లు వెదుక్కోకుండా... యిళ్లకు కబురు చేస్తున్నాను. రంగ, మనకు వడ్డించగా...భోజనం చేసీ అవకాశం... తిరిగీ యింతటిలో రాదు. లెండి...తోటలో కూర్చుందాం...'

...వీధితలుపు వేశాడు!

* * *

*
* *

అది...రఘూత్తమారుని విజయసాధన పరాక్రమంలో...అప్రతిమానంగా వన్నెలు తీరుస్తూన్న...ఏకైక ధర్మశీలాపూర్ణ సంయోగము...ఇక్షురసము తీయదనమును...కల్పించే మాదిరి ప్రణయములో కారణము కనుపించని పొలయలుక...విలువ.

కాని...తూకము చలించనీయని...ధీరమానసులు ఎందరు..?

గులాబీలు...

ఉదయ-మందపవనకుమార నవలాలనలో పులకరించే విరిచేడియల తరితీపులు...కుసుమసుకుమారిని అలరించడం...సైదోడైన యౌవనరసికమూర్తి...అలంకరణమునకు...ముందంజ వేయడం:

—అంతవరకూ ఉచితంగానే ఉన్నది. గులాబీలను చూసి, మోహిని.. ముచ్చట పడింది. మంచుతడి ఆరకముందే...అరవిరిసిన మొగ్గలనే తుంచి, సిగలో అలంకరించాలని, శివరావు కల్పించుకుని నెచ్చెలి మాటను చిరునవ్వుతో తోసివేసి...పట్టుపట్టడం చేత... ఆమె, పెదవులమీది హాసరేఖను...మాయం చేసుకుని...అతన్ని అలయించింది.

‘కోయవద్దు...నామాటవినవూ?’ అని, మాలతి బ్రతిమాలింది. అతడు వినిపించుకోలేదు.

‘నాకు కోపంవస్తుంది...’—నయనాంచలముల కెంపుల ఛాయలు మొలకలెత్తించింది. అతడు లెక్క చేయలేదు...

‘ కోసినా…అక్కర్లేదు ’— బెదిరించింది. కాని ప్రయోజనం లేదు. అప్పటికప్పుడే…కావలసినన్నీ…చాలినన్ని తుంచేశాడు. తలలో తురుమవలెనని దగ్గరకువచ్చాడు. ఇక చెలగాటం ప్రారంభమైంది ! అందుకోలేకపోతానా అని, ఆతడు ; అందుతానా అనే ధీమాతో, మోహిని! తోటఅంతా…కలయవేసి…చివరకు…జాజి పొదలో పొంచిఉంది. కౌగిట చిక్కించుకున్నాడు…! పెనుగులాడి, విడిపించుకుని…పారిపోకుండా, నిలిచింది ప్రతిఘటిస్తూ…

‘ పోనీ…నీవు…అలంకరించుకో… ’

‘ ఊహు… ’

‘ దండ కట్టియివ్వనా ?

‘ గోహార్ లాగా…చెంపకుచ్చు… ’

— ఒకక్షేమూగనోము! చెయిచేసుకుని, సందిటపొదివి పట్టుకుని…బలవంతాన… తనకు అందమని తోచినమాదిరి…తలంతా ముడిచేశాడు. ఇనకరస్పర్శాచకిత ఉషాబాలలాగా…కిలికించితము …సహజంగా అభినయించింది— హర్షము… నవ్వువెన్నెల… వెంటనే…కోపము నిలకడగా…

గులాబీలన్నీ లాగి…చిమ్మేసి, తలంతా రేగగొట్టుకున్నది. పోనీ…జాజులనైనా కనికరించమన్నాడు. మల్లెలు…? ఊహుఁ…అంత చులకనగా లొంగిపోవడమేనా ?…ఆతడు దోసిలి నించుకున్న పూలను గారవించడమే ?…

ఏ జాతులూ…సరిపడలేదు. ఆతడు వెన్నాడి బలవంతం చేయడం…బ్రతిమాలటం మానలేదు…

మందార… !

పరుగెత్తుకుని వెళ్లి…మందార ముద్దబంతిని…కోసి…తలలో పెట్టుకున్నది. అవి ఆతనికి నచ్చవని తెలుసును…మరీమంచిది… !

'చూడలేను...తీసివేయి...'

'ఎంత అందంగా ఉన్నదో'

'లేదు...వినవూ...?'

'నీకేం తెలుసు...'

'లాగి వేస్తాను...'

'నీ...తరమే...'

—ఆతని చేతులో, మోహిని అంత...ఒళ్లు తెలియని...ఉత్సాహ-సరస ఆవేశంలో కూడా కొంచెం మోటుగా...ఉండక తప్పి నదికాదు. మందారాన్ని...లాగి, విసిరి వేశాడు...

మోహినికి...ఓడిపోయిన ఉక్రోశంతో...కనుల వెంట నీళ్ళు వచ్చినవి. మెరుపులు ..!

ప్రసన్నను చేసుకుందామని...లాంఛనములన్నీ...ప్రయోగించి—మర్యాద...అనునయం...వినయాంజలి... ఏమీ లాభం లేదు...

'నాతో...మాటాడవద్దు...పో'—అక్కడ నిలువకుండా...మేడలోకి పరుగెత్తుకుని పోయింది. అందుకోగలడు, ... ఆ బాల కురంగినిని...ఆపివేసి ..కిలకిలలాడించి...వదలగలడు... ! కాని... ఏమనుకున్నాడో, మొదట కొంచెం చిన్నబుచ్చుకున్నా...సహజ గాంభీర్యముతో...ఆమె వెళ్ళినవేపే చూసి...చూసి...మనసు మార్చుకుని మళ్ళా వస్తుందేమోననే ఆసతో... కాచుకుని... తోచక...వెళ్ళిపోయినాడు...

—పోయి...పరధ్యానంగా, కుర్చీలో కూర్చుని...గతరాత్రి...శేషించిన...కథాభాగమును చదివివేదామని ... పుస్తకాన్ని అందుకుని...సాగక, చిరాకుతో...నిష్కారణ వైరంతో, మూలకు విసిరివేసి...మానసవిహారిణి అయిన ప్రియనీమూర్తిని...రేఖలలో చిత్రించుదామని...లక్ష్యము కుదరక...కలవరపడుతూ...

ఆమె వస్తుందేమో... రమ్మని కబురైనా పంపుతుందేమో... పోర్టికోలో కనబడుతుందేమో అని... కిటికీదగ్గరగా నిలుచుని ..వాళ్ల యింటివైపే...చూస్తూ ఉన్నాడు—

వచ్చింది...

ఆమె కాదు...! కాకపోయినామాత్రమేం... ఆమెపంపిన... ఉత్తరం!

తీసుకుని వచ్చిన జవానుకు బల్లమీద ఉన్న పర్సు... వినాయకుడులాగా ఉబికి ఉన్నది... బహుమతీచేసి... బయటకు గెంటి,... చించి... ఒక్క చూపులోనే చదివేసి... భగ్నములైన... ఆశాసౌధములతోపాటు... తానూ సోఫాలోకి కూలిపోయినాడు...

" మాయింటిచాయలకు రావద్దు...మన యిద్దరికీ, యింతటితోసరి... "

—ఇంతటితోసరి...దేనికి...?ఆమె ప్రేమకు నోచుకోనని...దర్శన భాగ్యమైనా లేని...శుష్క-జీవనము ఇంతటితో...సరి...అని ఆమె ఊహించకలదా ?...

తన అపచారము ఏమున్నది: చేసినచేతకు మారుతీర్పలేని అరసికురాలా ? ... పరిణయసరణిని ఎరుగని...అమాయకురాలా? ...ప్రేమతో...అనురాగోద్వేగహృదయంతో...ఆడిన ఆటలు... ముచ్చటలు...వంచనలని భావించిందా... లేక ...?

...మోహిని...పరిత్యక్తే అంతా ?...నమ్మించి...వలచినట్లు మోసగించి... చివరకు గికురించి...నిర్దయతో వదలివేసే...కపటి కాదు...ఎన్నటికీ కాదు...! మొదట ... పరిణయాంజలిని... మన్నించి...దీనుని ధన్య చేసినది...ఆ దేవికాదూ...? జీవితమునకు నూతనశోభలు...పరిణయవ్యాఖ్యను... రచించినది... ఆ అమృతమూర్తి కాదూ ? ... కాని—

ఇంతలో మనసు మారిపోవడానికి... స్వర్ణస్వప్నావళి... త్రుటితముక్తాదామము కావడానికి...

కారణం...? ఏమికారణము కావాలి? ...జీవితమే విద్యుచ్చిరమని... భగవత్పాదోక్తి లేదూ...? ప్రణయం... క్షణభంగురం అయితేమాత్రం... అలాటప్పుడు... వింత ఏమున్నదీ...?

'త్వమసి మమజీవనమ్'...! ఎవరిని నమ్ముకుని... హృదయ సర్వస్వము అర్పణచేసినాడో... ఆమే... అకారణంగా తృణీకరిస్తే... ఇంకా...

ఇంకా... బ్రతుకు ఎందుకు?

పరిపరి విధముల ఆలోచించి చూశాడు—ఏ మార్గము ఉచితమా... సులువైనదా అని...? ఏమీ పాలుపోలేదు. జీవించడం ఎంత కష్టముగాఉన్నదో... స్వస్తి చెప్పాకు నేందుకు అనువైన ఉపాయముకూడా... అగమ్యముగానే ఉన్నది. మామూలు విధానములు... రభస... ఏమీ నచ్చలేదు...

...కాలము గడచిపోతూన్నది. తోచడము లేదు—దోవ, తెన్నూ. చనిపోవడానికి నిశ్చయించుకున్న తరువాత ... ఇక... మోహిని, దయతలచి, కటాక్షిస్తుంది అనే ఆశ మాపుమాసిపోయిన తరువాత...ఆలస్యం ఎందుకూ— మసలినందువల్ల ప్రయోజనం ఏమన్నా వున్నదిగనుకనా? ...

కాని, కళారాధనలో గడపిన జీవితం... అభిరుచుల వన్నెలతో శబలించిన చైతన్యము...గ్రామీణవైఖరిని అస్పందితం కానీయ్యడం...గిట్టడము లేదు. అందమైన జీవనరోచి...అందాల వెల్లువలోనే కలసి...మలగిపోవాలి...ఎలా?

అదాటునలేచి...ఫోను అందుకుని... బాబును పిలిచాడు. కష్టసుఖములు...లోతుపాతులు...ఎరిగిన సహృదయుడు...అప్తుడు అతడు ఒక్కడే...శివరావుకు. అతని దగ్గర ఏమీ దాచడు. అతని సలహా...సంప్రదింపు లేనిదీ, ఇంతవరకూ, ఏపనీ చేసినవాడు

కాదు. ఇప్పుడు...మాత్రం... అతడే ఒడ్డు ఎక్కించాలి...దోవ చూపించాలి—

శివరావు కలవరపాటును...ఫోనులో గమనించీ...ఆకళించీ కూడా.. బాబు...సహజ హాస్య-చలాకీ వైఖరిలోనే ... విసుగించుతూ సంభాషణ నడిపాడు. వస్తానని...వెంటనే బయలుదేరి... వస్తున్నట్టు నచ్చచెప్పి...అత్యవసరాన్ని గుర్తించేటట్టు చేసేటప్పటికే... పెద్దలు దిగివచ్చారు. బాబు పెట్టిన తిప్పలన్నిటికీ...ఫోను మీద కసిదీర్చుకుని...ఇక, అతనిరాక నిరీక్షించుతూ...విళంబన మూలమున...రేకెత్తుతూ పీడిస్తూ ఉన్న ఆశాలతను ఛేదించుకుంటూ...నిమిషం యుగమంత యాతనతో...

హుషారుతో...మేడమెట్లు ఎక్కి-వస్తున్న టక...టక...

శివరావు...ఆ అయిదు నిమిషములనుంచీ అనుభవించుతూన్న వేదన అంతా...కవళికలో...కేంద్రముగా ప్రతిబింబించుకుంటూ...చూడగానే, బాబు సానుభూతి చూపేటంత సానుతాపంగా, గాభరాపడేటంత చిన్నబుచ్చుకుని...కూర్చుని ఉన్నాడు.

బాబు విసురుగావచ్చి...కుర్చీలో కూలబడి...

'ఏమిటోయ్...విశేషం? రాత్రికి నాటకం ప్రయాణమేమన్నా ఉందా ఏం?'

'లేదు...'

'మరి...వ్రాసిందేమన్నా చదివి వినిపించడానికా...?'

'ఊహు...'

'అర్జంటుగా...ఊదావు సందేశం...ఏం మునిగిందని...?'

'నీ...ధోరణే నీది...'

'అదేమిటి...ఆ అపోహ ఒకటి ఎందుకూ...? మొదలెయ్యి... వినేందుకే వచ్చాను. తప్పుతుందా...'

'ఎప్పుడూ నువ్వు ఇంతే, బాబూ...'

' దానికేంలే...ఉపక్రమించు...'

' నేను...ఆత్మహత్య చేసుకుందామనుకుంటున్నాను...!'

' నిజంగా...'— బాబు ఏమీ చలించలేదు— ఇంత పిడుగు పడినాకూడాను.

' అవును...ఈలాటి విషయాలలో...అబద్ధం ఆడుతానా ?'

' లేదులే...నీ సంగతి తెలియదుగనుకనా...? సరే... నన్ను పిలిపించిన —'

' నీతో చెప్పి పోదామని...'

' ఓహో...అదా ?... విల్లూ గిల్లూ వ్రాసి ..ఎక్సిక్యూటరుగా ఉండమంటావా ఏం ?'

' నా దగ్గిర...ఏమున్నదని...'

' అవునులే,...అయినా...ఎంత లేకపోయినా...'

—చూపులతోనే శివరావు దృష్టినికూడా బంధించి...బల్ల మీద...బంగారపు సిగరెట్ కేసు వంకకు మరల్చి ...నిర్దేశించి—

' నేను...తీసుకుంటాను'— అని జవాబుకోసం నిలువకుండా...జేబులో వేసుకున్నాడు.

' వద్దు ..అది వుండనీ...ఎవరో...యిచ్చిన బహుమతి...'

' అయితే మాత్రం...ఇక...నీవు ఏం చేస్తావూ ?'

' నిజమే...'

'మరి...నీ యితరసరంజామా— పుస్తకాలు...సోఫాలు... టీసర్వీస్... పోయేవాడవు...నాకు యిచ్చేసేద్దూ...'

' పోయేవాడవు...' అని పదిమాట్లు వినడం శివరావు మనసుకు కష్టంగా ఉన్నది. నిజంగా పోయేవాడైనా...ఆతలపు... దానికి పూర్వరంగమైన విఫలగాధను...ఇంకొకరు తరవడం...

దుస్సహము...! కాని...కొంచెంసేపు ఓపికపట్టుకుని ఉంటే...ఈ కష్టములన్నీ తప్పుతాయి. కలకాలం...

'తీసుకో...నీకు కావలసినవన్నీ...మరి. కడసారి...ఈ జన్మకు ఇదే...అర్థించుతున్నాను—చక్కగా కడతేరే...ఉపాయం ఏమన్నా చెప్పు...'

'నీకన్న నేను ఏమంత ఘటికుణ్ణి...'

'నాకు తోచలేదు...నీవు చెప్పక తప్పదు...'

'...ఉరి...విషం...బాకు...రివాల్వర్...'

'ఏవీ...నచ్చలేదు. ఆదితప్పియనూ...అసహ్యం,...నాలుగో దానితో...పేచీలేదుకాని...అభావే...'

'ఎలెక్ట్రిక్ తీగె...'

'అమ్మయ్య...!'

—తరుణోపాయం చూపించినందుకు...శివరావు...అనేక విధముల కృతజ్ఞతను తెలుపుతూ... పొగడుతున్నాడు. బాబు, ఆ మాటలు ఏమీ వినిపించుకోక... క్రొత్తగా సంక్రమింపబోయే ఆస్తిని, యజమాని దర్జాతో... సరిజూచుకుంటున్నాడు— సిగరెట్ పొగలు వయ్యారంగా వదులుతూ... శివరావు అక్కడ ఉన్నాడు... ఇంకా జీవముతోనే... అనే సంగతికూడా మరచి పోయినట్లు!

'ఇదిగో... ఇది ఏమిటోయ్...?' —డ్రాయరు సొరుగులన్నీ శోధించుతూ... కాగితం పైకితీసి... చదవబోతూ... శివరావు మీదికి... ప్రశ్న భుజంమీదుగా విసిరాడు. ఆతడు, పోల్చుకుని... చప్పున లేచి... కాగితం ఒడుసుకునే ప్రయత్నంలో...

'వద్దు... చూడవద్దు... రహస్యం...' అన్నాడు.

'ఇంకా... రహస్యమేమిటి...?'

'మోహినికి... కడసారి... వ్రాసి...'

—శివరావు...మనసు పట్టలేక...జరిగిన యావత్తు కథనూ బాబుకు వివరించి...అలా ఉత్తరము వ్రాసిపెట్టి చనిపోతే .. చేసిన అపరాధం పరిమితి అప్పుడన్నా ఆమెకు తెలిసి...తప్తహృదయంతో...భావనలోనైనా... మళ్లా తనకొరకు ప్రేమవాటికను నిర్మించి...స్వర్లోకజీవన-తపస్సునైనా ... ఫలవంతము చేయదా, అనే...కోరికతో—

'బాగానే ఉన్నది...! నేను...ఆమెకు యిది అందజేస్తానులే...' —ఇంకా...బాబు అదేమాదిరి. నిష్కంపప్రదీపశిఖ... శివరావు అంగీకరించి...తల ఊగించాడు.

'అయితే...నాటకానికి...సీట్లు రిజర్వు చేయించావా ?'

'ఆఁ...'

'టిక్కెట్లు...నాకు యిచ్చేయి. ఎక్కడ వున్నారో చెప్పు. మోహినిని... నేను... నాటకానికి తీసుకువెళుతాను. నీవు లేని...లోపమున...కొరత ఉంటుందనుకో...కాని, ఏంచేయగలం ? ...'

'నోరు...ముయ్...'

—శివరావు...గర్జనతో లంఘించి...బాబు మెడ...అరచేతి వాలులో యిరికించి పట్టుకుని—

'కృతఘ్నుడవు...!నాసామగ్రి అంతా...హరించేస్తానన్నావు. నాచావు...నీకు, పండుగ అయింది...!అయినా, నేను దేనికీ కాదనలేదే...! ఇంకా, చాలక, నా...మోహినితో... మోహిని సరసను కూర్చుని...నాటకం చూస్తావా ...?'

'అదికాదు. నీవులేని...కొరత...'

‘ జాగ్రత !...మాటలు మీరకు. నేను లేని కొరత... ఆమెకు నీవు తీరుస్తావేం... ? నీలాటివాడిని... ఆమె కన్ను ఎత్తి అయినా చూస్తుందా... ? ఎంత ఆలోచనఉందీ ? అయినా నిన్ను అనవలసిన పని ఏముంది...లోకధర్మం...’

‘ నేను...వేరే ఏమీ దురుద్దేశ్యముతో...’

‘ బాబూ...మనసు ఏమీ బాగుండలేదు...నీవు వెళ్లు...’

‘ మరి...మోహినికి...నీ తుది ఉత్తరం... ? ’

‘ తుదిలేదు...మొదలు... ! మనసు మార్చుకున్నాను. మోహినిని...నేనే నాటకానికి తీసుకువెళుతాను... !’

—బాబు, కలలో కుబేరవైభవమంది, మేలుకున్న...కృపణుని విన్నదనంతో—

‘ నాకు...తెలుసునులే...నీ నాటకం అంతా. నన్ను ఏడిపించాలని... ’

‘...పో...’

‘ సరే...అసలుది తప్పినా...ఆ వేడి యింకా ఉడికించుతూనే ఉందే...! కానీ...రాత్రి...హాలుదగ్గర కలుసుకుంటాను...దంపతులను... !’

—గిరవాటువచ్చిన పుస్తకం గురి తప్పించుకుని బాబు... మహా ఘనకార్యం చేసిన ధీరుడులాగా నిష్క్రమించాడు.

దంపతులు... ! —ఆ మాట నొక్కగానే శివరావు మనసు అంతా వెన్నెలల మయమైపోయింది ! మోహినిని వదిలివేసి...చీకటి లోకములకు, ఆత్మహతుడై పోవలసినంత దురదృష్టం...! అంతా, కల...

ఉత్సాహం...ప్రణయావేశము ... వరదలైన సెలయేటి తరగలుగా...అతన్ని ముంచుకొని వస్తూన్నది. మోహిని...తన మోహిని...

—విప్పారి, కలతలుదీరిన చూపులతో, తోటలోని పూజాం పములను పరామర్శించుదామని, గులాబీలకోసం... అమాయి కంగా కథ పెంచి, ఇంతవరకూ తీసుకునివచ్చి...ఇలా మళ్లించిన, బటన్ రోజ్ తీవెకోసం...చూపునిలుపగానే...మల్లెలు, జాజులు... అన్నిటినీ మించి...కొట్టవచ్చినట్టుగా, గమకంగా, అంతా కుంకుమ ముద్దలుగా విరిసిపోయిన—మందార !

*　　*　　*

మోహిని...ప్రణయవిభ్రమంలో...తలపెట్టిన చిలిపితనం... ఏనాటో మరచిపోయేవాడే, కాని... బాబు...?

శివరావుకు...ఇంకా ఎందుకంటే ఆతనిమీద తీరని కోపం— చేసినది చాలక...తానే, ఆతని చావు తప్పించానని... బాబు అందరి తోనూ ప్రగల్భాలుకొట్టడం...!

*　*　*

* * *

—రాత్రి...అప్పటికప్పుడే, ఊరంతా...మారాము చేసి చేసి నిద్రాముద్రాంకితుడైన పసివానివలె...మాటుమణిగింది.

ఆతడు... కథకుడు... ఏకాంతంగా గదిలో బల్లముందు కూర్చుని...రచన ప్రారంభించాడు.

* * *

"....నిశ్శబ్దం....

సద్దుచేయకుండా.... సూరత్ చీరె కుచ్చెళ్ల మెరమెర వినరానీకుండా.... అడుగులో అడుగు వేసుకుంటూ, లోపలికి వెళ్లి.... స్విచ్ వేసింది.

కదలకుండా, దోమతెరమాటున పట్టుదిండ్లలో తల అచ్చుగా దించేసుకుని ఆతడు నిద్రపోతూ ఉన్నాడు— కొంటెతనానికి నిద్రను అభినయిస్తూన్నాడు.

చిరునవ్వుతో మందంగా మట్టెలు టకటక లాడించింది....! మెలకువ వచ్చినట్టు లేదు.... ఆ అలికిడికి.

సమీపించి, తెరలు తొలగించి మీదకు వాలబోయి.... వెనుకకు తగ్గి మునివ్రేళ్లతో చెక్కలి పుణికింది.

ఉహూ....

—తలవైపున టీపాయ్‌మీది ఫాన్ అర్ధవలయభ్రమణం చేయకుండా, బిగుతుచేసి.... పోయి వాలింది— నిద్రాలోలుపమోహనీవిలాసమోహనాభినయపారవశ్యాన....

'అబ్బ!.... ఏమిటీ.... ఊఁ.... ఎందుకూ? నాకు.... నిద్ర వస్తూంది....'

—పరాకున కనుమూయడంచేత అతడువచ్చి, సరసను కూర్చుని ప్రత్యంగపరామర్శనము తలపెట్టినదాకా.... తెలుసుకోలేదు: ఇక.... నవ్వు.... అణచుకుందామన్నా ఆగడములేదు.... గిలిగింతలలో.

'ఎప్పుడు వచ్చావూ.... నన్ను పిలువలేదేం?'

—బలవంతంగా ముఖం తనవైపు తిప్పకుని....కళ్లలో కళ్లతో.... అతడు ప్రశ్నించడంచేత, వేషం నిలుపలేక పోయింది; పెదవులు కదలలేకపోయినా.... కళ్ళలో, జవాబు తొణికిపోయినది.

'కాఫీ.... ఇవ్వవూ?'

'తీసుకోండి, ఫ్లాస్కులో ఉన్నదికదూ.... ఓవల్ టైన్!'

'ఊఁ.... నీవు....'

'నేను, లేవలేనమ్మా.... నిన్నరాత్రికూడా....'

'పోనీ— అక్కరలేదులే....'

'మానేయండి.'

'ఆశే!....సరే, మానేస్తే, మరి,.... దానికి బదులు, ఇంకా, ఇం....కా.... తియ్యనిది ఏమైనా....?'

'....అమ్మో....వదలండి; ఉండండి తెచ్చిపెడతాను.... వదలండి బాబోయ్! పన్నుదిగిపోయింది.... అబ్బ!....'

* * *

హఠాత్తుగా...ఏదోదూకిన చప్పుడు: గాజుగ్లాసు ముక్కలై పోతూన్న...గల ..గల...కం...గ్...

భావరూపచిత్రశాలలో వన్నెల విన్నాణములు తీరికలు దిద్దుతూవున్న.. అక్షరాల ముత్యాల సరులను కూరుస్తూవున్న... కథకుని హస్తం, కలంతోసహా బ్రేక్ వేసినట్లు ఆగిపోయి, కాగితముల దొంతర మీదనుంచి పక్కకు అంగ వేసింది.



రసభంగమౌతుంది, కదలవద్దు ... దేన్ని లక్ష్యము చేయవద్దు— అన్న అవాక్- హెచ్చరికను... కీళ్లుసడలినా, యోగబలం చేత దేహధారణంచేస్తూ రూపు చెడకుండా నిలుపుకుంటూన్న, స్థవిరాసనము... కిరకిరతో ఆవర్తించింది. విక్రమార్కుడు వచ్చి ప్రాణము పోసి పలికించినా, ఆ పాతకుర్చీమాటను... హితబోధను .. లెక్కచేసేవాడుకాడు, ఏలాగూను.

—తిరిగి, కారణము ఏమా అని చూశాడు. షెల్ఫుమీద నుంచి దుమికి, ఒలికిపోయిన టీని అవలేహనం చేయుడానికి పూర్వరంగముగా శ్మశ్రుసమ్మార్జనము చేసుకుంటూన్న... మార్జాలరాజు!- చిందరవందరగా శకల రూపాన రూపమేసరి చిరపరిచయవశమున వస్తు నిరూపణమునకు అవకాశలేశము కలిగించుతూన్న... గ్లాసు... సాసర్ మూత!

ఆ వేశంతో... ఉద్రేకంతో... లేవబోయినాడు. కుర్చీ చేయి అమరిక తొలగి విడిపోయి ..తూలగొట్టింది. పడకుండా, బల్లను ఊతంగా అనుకుని... అదలించబోయి, నిర్వేదము రేకెత్తించిన వేదాంతధోరణిలో 'సర్వమున్ అతని దివ్యకళామయ' మే కదా అని కూర్చున్నాడు. కుదురుకురాని మనసుతో... అభ్యాసయోగమున... కలం చేత అందుకుంటూన్నాడు...

చేతికి ...తడి...

ఏమిటీ—? లేచి, పడబోయి తప్పించుకున్న పాటులో మసీపాత్ర తలక్రిందైంది. సీరా అడుగంట ఒలికిపోయి .. మందగమనముతో, ఏకవాహిని... పాయలౌతూన్నది.

సామాన్యునిలాగా...అధీరునిలాగా...క్రిందించ గికురించిన విధాత సర్వయత్నసిద్ధికి న్యక్కారంగా...పక...పక...విరగబడి పోయినాడు.

—నవ్వుతూనే, చేయిజాపి...ఉన్న ఒక్క సిగరెట్‌నూ అందుకుని...కృపీటయోని పేటికాభావం చేత లాంతరునొక్క, ముట్టించి...మళ్లీ కల్పనా సమాధిలోకి వెళ్లిపోయినాడు.

* * *

'....ముసిరిన తుమ్మెదలను విదలించేలాగు... సజీవ పద్మినిగా...ఆ అమ్మాయి, మొగమాటము ప్రసన్నమౌతూన్న బలవంతముతో, తప్పించుకుని .. లేచికూర్చుని... చూసి సిగ్గుపడుతూ, ముఖం అటు తిప్పకుని... మళ్లా చూసి, మనసు నిలుపలేక, ఆతని మీదకు వ్రాలి, కౌగిలిలో అణగి పోతూ, తొలగిన పైట వదలకుండా పెనగులాడుతూ... ' వదలంబారిన నీవిపట్టుకుని '... సోఫామీదనుంచి...తివాసీ మీద, దొరలిపోయి...

...తప్పించుకుని... లేచి అందకుండా వెళ్లి... లైట్ స్విచ్ఛాఫ్ చేసి,—'

* * *

—ఒలికిన సిరా పాళీతో దోపుతూ...కథను దీక్షతో నడుపుతూన్నాడు.

మందాధిక్యాలను ధిక్కరించే జ్ఞానజ్యోతి...మార్పును మొదట అభిజ్ఞాతము కానీయలేదు : క్షీణించి...రవలు ఎగిరించి, కొనలుసాచి...శబ్దించి, ఎక్కిళ్లతో ... స్నేహదారిద్ర్యాన దీపం కొండ ఎక్కింది!

నిస్పృహతో కలం అలా జారవిడిచి...తలుపు తీసికొని వీధిలోకి వచ్చి నిలుచున్నాడు:— నిర్మానుష్యం... !

'సమయమిదే... రారసామి
తామసించకురా... '

—ఆలకించి, తలఎత్తి చూశాడు. పక్క-మేడమీదనుంచి ఫోన్ వినబడుతూన్నది. దీపము వెలుగున...అద్దాల కిటికీ తలుపు మీద...చుంబనోన్ముఖులైన దంపతుల ఛాయామూర్తులు అవతరించి, కార్యావసానమున విడిపోయినవి. పోర్టికోలోకి...సిగరెట్ ఊదేయడంకోసం ఆతడు వచ్చి—

—అనుకరణ మర్యాదను...కథకునికి...జేబులోకి చేయి పోతుండగా, శూన్యస్థితి జ్ఞాపకము వచ్చి...తెచ్చుకుందామని బయలుదేరినాడు.

దూరాన ఒక బంక్ తీసిఉన్నది. ఉత్సాహంతో అందాకా నడచిపోయి...అవసరం...ప్రస్తుతమూ గనుక అప్పుడు మెలకువ తెప్పించుకున్నాడు. జేబు అప్పటికి ఎన్నాళ్లనుంచో ఖాలీ...! కానీ లేదు. యింటా, బైటాను!...దుకాణదారు అపరిచితుడు. అప్పుపెట్టడం...?తిరిగి యింటివైపు...

'ఏమి...కావాలి, బాబూ...? రండి, వచ్చి అలాగ వెళ్లిపోతున్నారేం?'

జవాబుచెప్పక పోవడం భావ్యమా? ఏమీ అక్కర లేదంటే...ఆతడు ఏమనుకుంటాడు...? ఎందుకు...దగ్గరకువచ్చి వెనుకకు తగ్గిపోతున్నాడనుకుంటాడో? ..

'చాకలెట్సు...ఏమైనా ఉన్నవా?'

...ఉండవని రూఢిగా నమ్మకము గనుక ధైర్యంగా...కొనే వాడి లాగానే అడిగాడు.

'అఁ...దయచేయండి...'

చిక్కులో పడ్డాడు. అయినా...అంతకు పైఎత్తు చేతకాదు గనుకనా...ఘంవా లేదు...

'...ఏవీ, చూపించు.—ఉహూఁ ..ఇవికావు, లఁధారి యో కంపెనీవి...'—ఉంటే...అప్పుడు మహా కొనేసేవాడిలాగానే...!

'లేవండీ, అయ్యా...! ఇక్కడ రోజూ ఖర్చుకావు. తమ లాటివారు...రోజూ పుచ్చుకుంటామంటే...తెస్తాను. ఇవి చూశారా అండి...కొత్తరకం ...ఇవాళే యిచ్చిపోయినాడు దొర, సాంపిల్‌గా. కాల్చిచూడండి ...! ఒకటి ... తీసుకోండీ ... మాకు పోయేది ఏమున్నదీ...? మీరు నాణెం చేయాలి కాని...మాకేం తెలుస్తుంది...?

బలవంతం రవంతచేయించుకుని...వాడిని అనుగ్రహిస్తున్నట్టుగా...అనుకున్నాడు. నిజానికి మరో అప్పుడు...పరిహరణీయమైనా...ఎంతో ఆప్యాయంగా, వరప్రసాదంలా...ఉపత్తైనా మిగల్చకుండా ఆఖరుచేసి...మెలుకువతో—

'ఏం అంత బాగుండ లేదయ్యా...! చౌకరకం...టొబాకో మంచిదిగాదు...'—అని, నడుస్తూనే సమాధానం విసిరి...దుకాణదారు మాట వినిపించుకోకుండా, వెనుదిరిగి చూడకుండా...అంగలు పెద్దవివేస్తూ వెళ్లిపోయినాడు.

ఇంటికిజేరి...లోపలికి పోబోతూండగా పక్క మేడమీద నుంచి...ఇంకా, కిల...కిల...

—తెల్లవారింది—కథకుడు కనుమూయకుండానే... !... దినమణి కరావలంబనముతో...దీపిక అధికారం...తాత్కాలికమే అయినా...సమసిపోయినది. వ్యగ్రోత్సాహముతో...కలంపట్టి... బల్లమీద...ఆరక నిలిచిపోయి...దయ దలచిన...సీరాతో—

...కథను మరోమారు చదివి...విడిచివేసిన చోటనుంచి మొదలువేసి...అహమహమిక, తదధీనవృత్తులు...ప్రణయ కల్పనలలో పొదివిపట్టి ... ఆవరించుకుని వేధించకుండా ... నిగ్రహించాడు. కథకుని...కష్టభాకార్యయ స్మృతికాదు...స్పందించు నది... కావ్యాత్మ... !

'సార్...అయ్యా...పంతులుగారూ...'

'ఎవరు ?'

'నేనండీ...'

'అంటే...'

'నేను...నేనేనండీ...'

'ఎవరో...లోపలికి రావచ్చును. ఏం...రంగనాథా...ఉదయమే వచ్చావు...?'

'..పంపారండీ...'

'అలాగా... ! ఇంకా డబ్బురాలేదు. చూసి, ఒకటి రెండు రోజుల్లో...'

'మీరు...ఇలాగే వాయిదాలు... వేస్తున్నారు... ఘట్టిగా అడగమన్నారండీ...'

'చెప్పడం లేదోయ్.. యిప్పుడు లాభం లేదు...రావాలి, రేపో మాపో...'

'ఇప్పుడు...ఏలాగండీ...? వట్టిచేతులతో తిరిగివెళితే...యజమాని ఊరుకోడు...'

'నేను...వస్తాను కాదూ...'

'చెప్పినా వినరండీ...రేగిపోతున్నాడు.'

'ఒకగంటలో వస్తాను...పద. ఏదితప్పినా...కాఫీ కస్తు... కూడదు కాదూ...'

'మీ యిష్టం. పోనీ, కొంత అయినా ఇచ్చేదాకా... రామోకండి. మీవంటి వారిని...ఏమన్నా అంటే మాకు...వినడానికి కష్టమౌతుంది...'

'ఏమీ లేదు...నేను వస్తానులే...'

'సరి...ఉంటాను సార్...'

—నిజమే...! ఎందుకు నిష్ఠురమాడించుకోవాలి? కాఫీ లేకపోతే... భోజనం లేకపోతేమాత్రం... రేపూమాపూ గడవదంటావా...? కాలగమనాన్ని...కడుపు హెచ్చరికను...తొందరను...మఱపించడానికి...కలం లేదూ...? కల్పనానిధులు లేవూ...?

—ఆ మాటే...మరచిపోయి...మళ్ళా కథ...!

* * *

*
* *

## • మొదటి రీల్ •

చరణచాలనము! ఎదురు చిలుకల...ముత్యం కుచ్చుల పాంజేవులు... తడబడే విభ్రమంతో...ధీరంగా...అడుగుతీసి అడుగు...!

రెండవపాదంమీద...గమకంగా...వెడల్పు కుసుంబాచీర అంచు...మెరమెరలాడే...వైఖరి...!

ఎదురుగా...పురుషపాదవిన్యాసము ... తొందరగా.. తడబాటుకు సూచనగా...

—దృశ్యము విప్పారగా...ఎదురెదురై ...సంభాషణలో... భేదాభిప్రాయము ... కోటికిరాగా...పట్టుదలతో మాట నెగ్గించుకోవాలనే గదమాయింపుతో...ఆమె! సామాన్య సంసారిణికి కొంచెం ఎబ్బెట్టుగాతోచే ... చలనచిత్రతారలకు ఉచితమైన ... సాహస వేషాలంకరణములు. రసికత్వము...తీరనికోరికలు...మెరసే చూపులు. లేతవయసు...

ఆతడు...కాయుఖారు ... వయసుమళ్లుతూన్న ... ద్వితీయ యౌవనాంతం చలాకీ మెరిపించడానికి ప్రయత్నించే... తేడా కనుపించుతూన్న దాంపత్యమునకు కారకుడు ... రెండవపెళ్ళివాడు. ఇంకా పడుచు చూపులూ, ఆలోచనలూ...వదలనివాడు.

రాజీ కుదరనందువల్ల...ధూకుడుగానే నడుస్తుంది సంభాషణ. ఎవరూ వెనుదీయడమునకు సంసిద్ధులు కాలేదు. ఆతడు కొంచెం

తమాయింపుగా... అనునయింపుగా ... నచ్చచెప్పవలెననే...హద్దు మీరకుండా...ఏదో అపరాధం మాటు చేయవలెననే ఆదుర్దాతో... ఏలాగో సంభాషణ తెమల్చవలెనని—ఆమె...లొంగిపోకుండా... అనవలసినవి అన్నీ అని...తప్పు అతనిదేనని ఒప్పించి... మెదలకుండా చేయాలని...

'నేను...ఒప్పుకోను...ముమ్మాటికీ.'

'ఎందుచేత... ?

'ఎందుచేత ఏమిటి... నాకుయిష్టంలేదు.'

'మరి...యింతకన్న వేరేమార్గం కనబడ...లేదు.'

'నాకు అదేమీ తెలియదు. ఆవిడ...వంటమనిషిగా... ఉండటానికి నేను ఒప్పుకోను.'

'నేనిక ఉరిపెట్టుకోవాలి...! ఏం చేయను, ఊరంతా గాలించినా...వంటవాడన్నవాడు ... సజావైనవాడు దొరకలేదు...! ఉన్న ఆ ఒకరిద్దరికీ...పాతికా, ముప్పైకావాలట...'

'అయినా సరే...మగవాణ్ణే కుదర్చండి!'

'ఏం...ఆడది ఉండటానికి నీవు ఒప్పుకోకపోతే...మగవాడు ఉండటానికి...నేను ఒప్పుకోను...'

'అయితే...మానేయండి.'

'నాకేం... వంటభారం నీమీదనే పడుతుంది.'

'నాచేత... గరిటె పట్టించి...తప్పేల దింపించుదామనే!...'

'...నా దగ్గర, ఆ తాహతు ఉంటే...నీవు ఎందుకు ఇలా ఆడుతావు?...ఎట్లా అవస్థ ..?'

'హోటలునుంచి...'

'మా బాగుంది...! సంసారమంటూ ఉండి... నెలకు ఎనిమిది వందలు ఉద్యోగంలో తెచ్చుకుంటూ...యింట్లో నీకు ఏ రోగము

రొచ్చు లేక...హోటలునుంచి తెప్పించనా భోజనం, పూట పూటా ? ... అప్రతిష్ఠ.'

'అయితే...మీ యిష్టం.'

'పోనీ, మీ పినతల్లికూతురు సుందరమ్మను... మళ్లా పిలిపించు...'

'...ప్రాణం పోతూన్నా...దాన్ని ఇక, ఈ గడప తొక్క నీయను. మీకేం చెపుతారు! బయట తల ఎత్తుకు తిరగ నక్కర లేదూ...? ఇదివరకు...అయినదానికే...'

—ఇద్దరూ పూర్వస్మృతిని...మననం చేయడం అభినయిస్తూండగా...దృశ్యం...మబ్బుగా అయిపోయి...మాయమయి...క్రొత్త వెలుగులో...

వీధివేపున కిటికీకి...కొంచెం ఎడంగా...తారసలాడుతూ, వైధవ్యముద్రతో ... మామూలు వేషంతో ... పడుచుపిల్ల... సుందరమ్మ...

కిటికీ అవతల...రోడ్డుమీద...నిదానించి యింటివేపు చూస్తూ... సైగలు విసురుతూ...మనోహర నేపథ్యంలో... యువకులు...

—మాయమై...మరోదృశ్యము...! వెన్నెలలో...బాగా ప్రొద్దుపోయిన తరువాత...

...బాల్కనీలో...బెదురుతూ...అలికిడి కానీయకుండా... ఎదురుచూస్తూన్న సుందరమ్మ. క్రమంగా దృష్టిగోచరుడైన... ఎవరో యువకుడు...! ఇరువురూ...పరిచయం ఉన్న వాళ్లులాగా... సైగలతో మాటాడుకుంటారు...

వాళ్ల ధోరణిలో వాళ్లు ఉండగా...వెనుక...హాలులో చప్పున దీపం వెలుగు. వెలుతురులో...ఆమె...!చూసి సుందరమ్మ చకితఅయి...గాభరాతో లోపలికి పారిపోతుంది. ఆమె... బాల్కనీ

లోకి వచ్చి...చీకటిలో మరగిపోతూన్న...మనిషి ఎవరో ఆనవాలు పడదామని నిశ్చలంగా చూస్తూ...

—కమ్ముకువచ్చిన దృశ్యం. సుందరమ్మ దీనవదనంతో... బావిలో కాలు పెడుతూంటుంది...ప్రయాణమైపోతూ.

మళ్లా...యథాప్రకారం మొదటివిధము...సంభాషణ.

'అప్పుడే ఏలా మరచిపోయినారండీ...? అయినవాళ్లూ, కానివాళ్లూ...విస్తారంగా చెప్పుకుని...'

'ఏలా ఏడుస్తుంది, మరి: ప్రతిదానికీ ఏదో ఒక వంక...! ఎందుకూ, కలిసిరావాయె: ఇదే, నీతో అవస్థ...! ఏడాది కాలేదు, కాపురానికివచ్చి...వేధించుకుతింటున్నావు.'

'మాటకుమాట తెగులన్నారు...! తీగ కదిలిస్తే...! అయినా, గుమ్మడికాయల దొంగా అంటే...మీరు భుజాలు తడుముకోటం ఎందుకూ?'

'లేదులే...వెయ్యిమంది లాయర్లను చంపిపుట్టావు...! మాట అని నీతో గెలవగలనూ?...ఈసారికి ఇల్లాపోనీ...నామాట విను కాస్త. గుమాస్తాతో చెప్పాను; రేపటినుంచీ వస్తుంది ఆమె...'

'రావద్దని కబురుచేయండి...మీకు, చేతులో మనుష్యులు కొదవా?'

'బాగుండదు...నగుబాటుపని...బ్రతిమాలుకుంటాను... నా పరువు దక్కించు...'

'...సరి...కాని, ఓ కండిషను. ఎప్పుడుపడితే అప్పుడు పొమ్మనడానికి...నాకు అధికారం...'

'అలాగే. అయితే...కారణం ఏమిలేకుండా...'

'...కారణం లేకుండా...నేనేపనీ, చేయను...'

'అవును...నాకు తెలియదూ, నీ సత్తా?'

'అదిగో...అమాటలే...అనవద్దన్నది...'

'నాకెందుకు బాబూ... ఆఫీసుకు వేళ అయింది... వెడుతున్నా...'

—అతడు నిష్క్రమించి...తిరిగి, ఆఫీసువేషములో...తలగుడ్డ సద్దుకుంటూ...గుమ్మందగ్గరనిలిచి వెళుతున్నానని...చెపుతాడు. ఆమె...చూస్తూనే,జవాబుచెప్పదు. అతడు... చూపులుకలిపి, ప్రసన్నను చేసుకుందామని...మసలి...ప్రయోజనం లేక...చిన్నబుచ్చుకుని...అడుగు వెనుకకువేసి...చాటు అయిపోతాడు.

వెళ్ళినతరువాత...ఆమె చిరునవ్వుతో, విజయగర్వంతో... అతడు కనబడినవైపు చూపు మరల్చి...చూసి...ఆలోచనలో... ఏదోధ్యాసలో... తమలపాకులచిలుకలు అందుకుంటూ... సన్నని గొంతులో...పాడుతూ...!

కొన్నాళ్లకు: భోజనములముందు ... ఉభయులూ కూర్చుని ...ఎదురుగా...మాటలాడుకుంటూ నిదానంగా భోజనం చేస్తూంటారు. వంటఆమె...మాంచి, కట్‌మస్తీగా, కాంక్షణీయంగా ఉన్న భారీమనిషి...వడ్డన...సహజవయ్యారంతో...చేస్తూంటుంది. అతడు, గృహిణి కన్నోరగి...వంటఆమెను...చూపులతో ఎకసెక్కెము చేస్తూ...చిరునవ్వు పంచుకుంటూంటాడు. ఆమె, ఓరగా...యీ వైఖరి గమనించుతూ...కోపమూ, అసహ్యమూ, ప్రత్యేకంగా... స్పష్టంగా...పూర్ణాననంలో కనపరుస్తూ ... ముభావంగా ... భోజనంతో...ఆడుకుంటూ...సమయంకాచి దుమికే ఆడుపులి ఊతంతో కూర్చుని ఉంటుంది.

అతడు...ముగించి... లేచి, ఆమెవంక చూడకుండా వెళ్లిపోతాడు. ఆమె, కంచం వదలి...తొందరగా వెంటనంటి...

హాలులో...తువాలతో...చేతులు తుడుచుకుంటూ... దుస్తులకోసం స్టాండును సమీపించుతూండగా...విసవిస... వెనుక

నుంచి అమ్మలాగా... వేగంగావచ్చి...నిలవేసి...గర్జనతో...చీవాట్లుగా—

పట్టుపడిపోయినాననే బెదురుపాటు...ఎలాగైనా, తప్పించుకుని బయట పడవలెననే ఆతురత...అతని కవళికలో...!

చిక్కినప్పుడు...అంతు పూర్తిగాకనుక్కుని...సంగతి తేల్చి వేయదలచిన...నిశ్చయం, దీక్ష...ఆమె వాలకంలో...!

'మీ...ప్రవర్తన...నాకు ఏమీ బాగుండలే...!'

'ఒకప్పుడు...నచ్చిందా ఏమిటి నీకు...!'

'ఎంచడం మొదలుపెడితే...సంచులు నిండుతాయి...! అవన్నీ ఎందుకూ...ఇప్పటిమాట...'

'అలాగే మరి...'

'వెధవ కబుర్లుచెప్పి ... సంగతిమాటేయడంలో... మొనగాళ్లు...! చెప్పండి...నేను అడిగేదానికి సరిగా సమాధానం...'

'లేకపోతే...'

'ఏం చేయాలో...అదే చేస్తాను...!'

'అంతవరకూ వచ్చిందీ...'

'ఆఁ—'

'ఇంతకూ...అసలు ఏమిటి ?'

'అదే...నిలవేసి అడుగుతూన్నది. మీ ప్రవర్తనఏమీ బాగుండలేదు. నేను ఒప్పుకోను...మీరు నూరుచెప్పండి వేయి చెప్పండి. భోజనానికివచ్చింది మొదలు...లేచేదాకా...వంటదాని వంక...అదేపనిగా ఓటే చూడటమా ?'

'చూపులో...ఏమున్నదీ ?...'

'దోషం...'

'గంతలు కట్టుకుంటాను...'

‘ ఏమన్నా కట్టుకోండి ’ ఇఖ— సాయంకాలమునుంచీ … ఆవిడకు ఉద్వాసన ! ’

‘ …చెప్పేశావా, ఏమిటి ? ’

‘ కాస్సేపుండి…చెప్పాలనుకుంటున్నాను. ’

‘ నీపుణ్యమాయెను…రెండురోజులు ఓపికపట్టు … అమ్మాయీ, మేనమామ వస్తారు, రేపు; వాళ్ళువచ్చి వెళ్ళిందాకా… కాస్త… ’

‘ సీత…ఉత్తరం వ్రాసిందా ? ’

‘ మరే…యీస్టరుకు…తాతగారి ఊరువచ్చిందట. నన్ను ఓమారు చూసిపోదామని, ఇక్కడకు… ’

‘ ఇక…కూతురుగొడవలో…పడతారు…కాబోలు… ’

‘ నువ్వేమన్నా…నాకు తప్పుతుందా మరి, కన్నకడుపు. ఎందుకొచ్చింది. మీ యిద్దరికీ సరిపడదుగదా అనే…దాన్ని మేనమామగారియింటికి పంపించివేశాను. చదువుధోరణేమో… అదేమో… ’

‘ ఇటువంటివే…వళ్ళుమండేవి: ఇరవై ఏళ్ళు శరీరంమీదికి వచ్చి, పెళ్ళీ పెటాకులూ చెయ్యక…పట్నంలో మెడిసిన్ చదివించడమూ ? పట్నవాసంలో…స్వేచ్ఛలో…ఎందుకన్నా…ఇక కనికి వస్తుందా… ? ’

‘ దాని…సంగతి…’

‘ ఆc… అందరిసంగతులూ కాచివడబోసినవే … చెప్పక్కర్లేదు…! దీనంతకీ తోడు…ఆ మేనమామ సహవాసమూ ? పిల్లాన్ని విడిచిపెట్టి…ఏదో ఆర్టు- గీర్టు అంటూ అడ్డమైనవాళ్ళ బొమ్మలూ గీస్తూ…అల్లరిగా, తెగిన గాలిపడగ లా తిరిగేవాడా— మీఅమ్మాయికి గార్డియన్ !…ఏం చక్కగా ఉందీ ?…’

'పోనీలెస్తూ...అదంతా నీ కెందుకు...'

'అవును...లేకపోతే, నా కెందుకు...! ఇంతకూ లోకానికి వెరచికాని...వాళ్ల వాకిలి తొక్కేందుకైనా వప్పుకుంటానా?...'

'పాపం...పుణ్యం...లోకభయం...'

'నాకు...ఆలాటి పిచ్చి వేషాలు ఏమీ లేవు...! పాపం!...అది లేకపోతే ... చక్కని పాపం చేయకపోతే...జీవితపరిణామం పక్వము కాదని...నా మతం...!'

'ఓహో...'

'ఊహూ...! అందులో ఉండే ఉత్తమాదర్శం...విశిష్టలక్ష్యం ...తెలిస్తే కాదూ, ఒకటి అసలు! అభిమానం...పట్టుదల...పోకైన తలతిక్క...ఇవే లేకపోతే... జీవితం నగిషీకి మెరుగే వుండదు!'

'ఇన్నీ ఉండి...నడవడి అనేది...'

'నడవడి!...లేకపోతే మాత్రం ఏం? ... జీవితంలో, నడవడి...అన్నిటికన్నా ముఖ్యం అనేది...వట్టి చచ్చుసిద్ధాంతం...!'

'అవును లే...వ్యక్తిత్వమును రెచ్చిపోనీయడానికి తలపెట్టిన...మహానుభావవు...!'

'ఆత్మాభివృద్ధే కాదూ...జీవితోద్దేశ్యం!'

'...నేను...నీతో వాదించ లేను...'

'కనబడుతూనే ఉంది...వేరే సెలవియ్యాలా...?'

'ఏమనుకున్నా సరే...! ఇంతకూ...అసలుమాట పోయి యీ ధోరణిలోకి దింపావు. నేను చెప్పినది జ్ఞాపకం ఉన్నదా...తీరా అభాస చేశావంటే...'

'ఇంకో నింద నామీద పడుతుంది...అంతే కాదూ...? ఇది వరకు...కూతురికీ మీకూ కాకుండా చేశాను. ఇప్పుడు...యింటికి వస్తే...దేవిగారు దయచేశారని... వంటమనిషి లేకుండా చేశాను...!'

కానీయండి...అన్నిటికీ...ఒడిపట్టేఉన్నాను. మీకు ఆ భయంలేదు లెండి. ఇక ఈ నాలుగురోజులపాటూ, చూపులకు...తీరిక ఉండ దనుకుంటాను... ? ఎంతకైనా...మగవాళ్ళు... '

—మాటల ధూకుతులో మునిగి, ఇద్దరూకూడా, వంట ఆమె వచ్చి వేచివున్న విషయం గమనించరు. ఆమె...సంభాషణ... పొంచివుండి వినే సహజ- అలవాటుతో, కొంత సేపు ఆలకించి, అర్థం కానందువల్ల, విశేషించి తనకు సంబంధించినది కానందువల్ల మొగం లో, ఉత్సాహము లేకుండా...తేలుకుట్టిన దొంగలాగు...తప్పనిసరి అయి...చిరుదగ్గుతో...తాను వచ్చానని...ఏకాంతమునకు భంగము కలిగించుతుంది.

'ఏం... ? '

'మధ్యాహ్నం ఫలాహారం...ఏమి చేయమంటారు...? '

'ఏమండీ ..దూద్ పేడా...జిలేబీ... '

'నీయిష్టం... '

'సరే ..అవి చేయవమ్మా! ఇదిగో... రేపు బంధువులు వస్తున్నారు...పట్నవాసం...వింతవింత రుచులవారు... ! ఏలా మెప్పి స్తావో... నేను మళ్ళా చెప్పకర్లేదు. అమ్మాయి...ఏదిపురమా యించుతే...నిమిషాలమీద అది అమరించాలి... తెలిసిందా...? '

—వంటఆమె ముఖంలో...ముప్పూతిప్పించుకున్న ...బ్రతుకు- జీవుడా-భావం ..! ఆతని చర్యలో...తుపానుదెబ్బ తగిలి తెప్పరిలు తూన్నమాను...పోలికలు...! ఆమె నయనాంచలములలో...సర్వ తోముఖ విజయపాండితి...!

...కమ్ముకుంటూన్న మబ్బులో...వంట ఆమె వెళ్ళిపోవడం, ఆతను...షర్టు అందుకునేధ్యాస. గెలుపు మెరిపిస్తూ నిలిచి పోయిన...ఆమెచూపులు...

—హారన్ ! ... కారు, దూకుడుగావచ్చి ... బ్రేక్ పడి, తఫీఅని ఆగిపోతుంది. సీడన్ బాడీ అద్దం తెరలోంచి ... షోఫర్ ... చప్పునదిగి...దిగుతూ, తలుపునొక్కేసి...

కారు...సరాసరి డ్రైవరు, తలుపుతీసేదాకా ఉండకుండా... సీత, చలాకీతో క్రిందకు ఎగిరిదూకి...గబగబ యింటిమెట్లుఎక్కి ... మధ్యలో ఆగిపోయి...ఓరగా వెనుక తిరిగిచూసి...అనుసరించమని తలవిసిరి సైగచేసి...వెళ్లిపోతూంటుంది. కారులోనుంచి...నిదానంగా దిగిన ... కళాభాయి వేషధారి, ఉత్తరీయం ... పైటమాదిరిగా అంచులు సర్దుకుని, లెక్కగా అడుగులువేస్తున్నట్టు... కదులుతాడు.

డ్రైవరు... సూట్ కేసులు, జవానుకు అందించుతూంటాడు.

— కొరైడాక్. ఆతను మొగలాయి పాపోసులతో...యింటిలో వేసుకునే కంచెమెడ...సగంచేతుల చొక్కాతో...ఒకచేత... నేలజీరాడేలాగు...పత్రిక ... ఇంకో చేతితో ... సులోచనాలు తీసి వేస్తూ...

కారునుంచి దిగిన అమ్మాయి...ఆతనినిచూచి...సూటిగా లేడిపిల్లలాగు ... ఉత్సాహంతో ... సమీపించి ... భుజములమీద చేతులు వేసి—

'నాన్నా ...'

' ...వచ్చావూ ...తల్లీ...'

' ఏం ... చిక్కిపోయినావు... '

కొంచెందూరంగా...రంగానికివెనుక మౌనంగా, నిలుచుని ఉన్న...ఆమె...కనబడి...అందుకుని—

' నాపోషణలో...చిక్కిపోక...ఇకఏలా ఉంటారు ?...వచ్చావాయెను...ఇకబలిపించు...'

మనసు చివుక్కుమనడం ... ఆతని విషాదవదనంలో ... ! ఆ అమ్మాయి... తెల్లబోవడంలో... ఆతను తల... వంచుకుంటూంటాడు. సీత... భావపీడనము... ప్రసన్నతమాటున బలవంతాన దాచేస్తూ...

'ఏం... పిన్నీ... కులాసా ?... కోప్రసాధారాలు అందినమాటే వాళ్ళు కాదేం... ? అన్నిరంగులూ వచ్చినాయా...; '

—కళాభాయి మందగమనంతో...

'ఏం... బావా ! వయసు ముదురుతూన్నకొద్దీ... బాలమెరుపు వస్తూంది.. గుమ్మడిపండు నవుతున్నావు ?..

ఆతడు... చిరునవ్వుతో ... ఇంకా దీనంగానే ... మూగగా స్వాగతం చూపులతో అందించుతాడు...

...సీత, తండ్రిని ... మేనమామను ... చూసి నవ్వుతుంది. అందరూ ఓక్షణం కదలకుండా నిలుచుని...

...కళాభాయి... బెరుకుగా... ఆమెవంక చూస్తాడు. ఆమె... చూసి, చూపు ... చురచుర లాడించి మరల్చుకుంటుంది. ఆతని ముఖం... మేఘచ్ఛన్నమౌతూ...

...సీత... మేనమామ ఉత్తరీయం విప్పిస్తూ...

'పెళ్ళినడకలేం ... మామా ... ? పోయి వేగిరం స్నానం చెయ్యి. కాఫీ తీసుకుని ... తరువాత నిదానంగా ... మాట్లాడుకో వచ్చును... '

... డ్రైవరు ... యూజెల్ ... స్టాండు ... చెరొక చంకను,— వెనుకాల, సూట్‌కేసులతో, జవాను.

—సాయంకాలము ... నీరెండ ... పొద్దువాలిపోతూన్నది. మేడమీది ... వసారాదరిని పిట్టగోడమీదుగా వంగి ... నిరీక్షించుతూ... సీత. వెనుక... ఆమె...

...క్రింద...కారు ..వచ్చి ఆగుతూండగా లోపలనుంచి,... మేనమామ...తల...కనబరచి ... చేయివిసురుతాడు : సీత జవాబు యిస్తుంది.

'పిన్నీ...షికారు వెళుదాము...రావూ ?'

'రాను...'

'రా...సర్దాగా...ఉంటుంది...'

'మధ్యను...నే నెందుకు... పానకంలో ... '— శేషమును ...చూపు-హేళనతో పూరించి ఆమె లోపలికి వెళ్ళిపోతుంది. సీత...మనసు చివుక్కుతో...మెట్లుదిగుతూ...

— కారులో...పరధ్యానంగా...సీత... అచ్చెరువుతో...మేనమామ... చేయిపట్టుకుని, కదిలించి—

'ఏమిటి...మూగనోము...'

సీత సిద్ధాంతమును ప్రతిపాదించే ధీరనిశ్చయముతో,...

'మనం...ఇక్కడకు రావడం...పొరబాటు.'

'ఏమీ ?'

'ఆమెకు ... యిష్టములేనిదీ... నాన్నకోసమే అనుకో... అయినా... '

కళాభాయి...పక్కకు చూస్తూండగా...ధూకుడుగాపోతూన్న కారులోంచి...అతని మొగం...తళుక్కుమంటుంది. సరసను ఇంకో జవ్వని ఉన్నట్లు...చూచాయ...

మామ...సీత గమనించకపోవడంచూసి... తేరుకుని...కలవరం దాచేసే నవ్వుతో—

'నీవి...అన్నీ వట్టి అనుమానాలు... '

'నీవు ఎప్పుడూయింతే...ఏమాట చెప్పినా...!

'ఎక్కడకు...వెళుదాం,...'

'నీ యిష్టం...నాకు...కులాసా అంతాపోయింది...'

'నన్నుచూసి... నేర్చుకోరాదూ...'

సీత...నిశ్చలంగాచూసి...అప్రియత్నంగా...అతని నవ్వులో...తనహాస రేఖను...కలుపుతుంది.

—డ్రాయింగ్ రూమ్ : అతను...పచారు చేస్తూ...ఆలోచనలో ఉంటాడు...మధుర భావనలో మునిగినట్లు...ముఖాన...కళ.

సీత...బెరుకుగా... తండ్రిని సమీపించి ... మాటలుసాగిన కొద్దీ, ధైర్యంతో—

'నాన్నా...మామయ్యా, నేనూ...రేపు వెళ్ళిపోతాను...'

అతడు...కంగారుగా— 'అదేమిటమ్మా ... మొన్ననే వస్తిరి...ఇంకో నాలుగైదురోజులు ... సెలవలు అయిపోయే దాకానైనా...'

'ఎందుకు లెస్తూ...ఆవిడ రుసరుసగా...అయినదానికీ కాని దానికీ చీకాకుపడుతూ...విసుక్కుంటూ...సన్నసన్నగా...సూటీపోటీలు అంటిస్తూ...'

'అవును...ఇవాళ క్రొత్తేముందీ?... మామూలేగా...! ఇంతకూ, నాముఖం చూసివచ్చావు. కాని...'

'అంతేమరి. పోనీలే, శనివారందాకా ఉంటాము. ఆవేళ యింజనీయరుగారి అమ్మాయి అన్నప్రాశనట. ఆమె వస్తేనే కాని వల్లకాదని మరీమరి చెప్పింది. సరేలే...'

'కానీ అమ్మ!... నీయిష్టం...తండ్రినై ఉండికూడా, ఇంత అశక్తుణ్ణి అయిపోయినాను ...'

'ఎబ్బే...విచారపడకునాన్నా...! మాటవరుసకుఅన్నాను. నీవు నాకు చేసిన లోపం ఏమిటి? వేయికళ్లతో...కనిపెడుతూనే ఉన్నావు...'

...వింటూన్న కొద్దీ పొంగివస్తూన్న విచారాన్ని...ఆమెచూడ కూడదని...మిషతో...మాటమార్చి—

'అదుగో... మామఎందుకో నిన్నుపిలుస్తూన్నాడు ... ఏం కావాలో కనుక్కో...'

తండ్రివేదన గ్రహించిన చూపులతో ... సీత...సాలోచనగా...వెనుదిరిగి...అడుగులు వేస్తూ.

అతడు...ఆమెవంక చూసి...ముంచుకున్న పరితాపంతో... తల కుంగి...వాలిపోతూ.

—ఆయింటిలో ...కళాభాయి ... విడిసినగది కిటికీదగ్గర... కాలు గోడకుతన్నిపట్టి...కుర్చీ వెనుకకునెట్టుతూ కూర్చుని... పెన్సలుతో... స్కెచ్ ...ఊహతో చిత్రించే ధ్యానంలో ఉంటాడు.

ఆమె...గదివెకట...గుమ్మంలో కనబడి...లోపల ప్రవేశించే సూచన కనబరచి...తప్పుకుని... ఒక నిమిషండుండి...మళ్ళా వచ్చేస్తుంది...

సీత అనుకుని...చిత్రం మీద ధ్యానమును హుషారుగా మరల్చిన మామ...ఆమెను చూసి... తెల్లబోయి...సంభ్రమంతో ... రాకకు కారణం ఊహించలేని చూపుతో ... కొంచెం ఆశతో...

'మీరా...'

'అవును...ఏం అలా ఉలికిపడ్డారు... '

'ఏమీ లేదు...సీత అనుకున్నాను...'

'సీత...ఇంజనీర్ గారింటికి వెళ్ళింది...'

'బావ...ఏం చేస్తున్నాడు...'

'ఆయన...కార్ లో...ఉడాయించారు. ఏమిటో...బొమ్మ

'ఆఁ...ఏమిటో...మీరు చూడతగినంత...'

'పోనీలెండి. నాకు బొమ్మలంటే ప్రాణం, అందుకని అడిగాను...'

'దాసు...ఎరుగున్నారుకాదూ... మేమిద్దరం...చిన్నప్పుడు సావాసం...ఇరుగూ పొరుగూ.'

'అలాగేం... నేనూ అతడూ...బొంబాయిలో కలిసి నేర్చుకున్నాం...'

'మొన్ననే...ఈమధ్య వచ్చి వెళ్ళాడు ... ఎంతబాగున్నాయనుకున్నారు బొమ్మలు...! మీరు...మీ చిత్రాలు ఏమన్నా పట్టుకు వచ్చారా... ?'

'లేదు...'

'అవును లెండి...అవసరం ఏమున్నదీ, ఇక్కడ... ?—నా బొమ్మవ్రాస్తా నన్నాడు దాసు... నేనే.. ఎందుకని...'

'ఆ వరం...నాకు...ఇవ్వకూడదూ...మీరు'

—మామ... లేచి...నిలుచున్న ఆమెను సమీపించుతాడు. ఆమె చలించకుండా—

'మీరు...ఆర్టిస్టు...గీతలలో నేనా...'

'... చేతలలో...కూడాను!'

...కొంటెగా...కోప మేమీ లేకుండా...మామ వంక ధైర్యమిచ్చే చూపుతో— 'ఏం జాణలండీ...! అయిల్సులో కూడా చేతనవునా అని...నే ననబోయింది...'

'పరీక్షకు...తాళిన తరువాతనే...'

'తరువాత...'

'బహుమతీ...! ఎంత అందంగా ఉన్నారు...'

' మీా...కళ్ళు... '

ఆమె...సిగ్గు మాయం అవుతూన్న...కాంతుతో— ' ఏమం టున్నాయి... ? '

' నన్ను...మరువవద్దు...అని...చక్కిలిగిలి... '

' మడిగట్టుకునే... '

—రెండుప్రేమవాహినులూ ఏకమయే విభ్రమ సన్నివేశం...! మరీదగ్గరకు వచ్చిన ఆమెను...మామ కౌగిలిలోకి లాగుకుంటూండగా...

—ఏకాంతం. అలలు దగ్గరకు తగిలేలంత సమీాపాన...సముద్రం ఒడ్డున...మసకచీకటిలో...

ఆతడు ఆనుకుని...ఇంకో శ్వేతకన్య...ఏకంగా...ఒకఫొటోను చూస్తూ...పారవశ్యంతో...ఆలింగనం...

—తోటలో...సీత...వికర్ కుర్చీలో చిన్నబల్లదగ్గర కూర్చుని, చదువుకుంటూ...

...వంటఆమె...కాఫీతీసుకునివచ్చి...అమర్చుతుండగా...

' ఎన్నాళ్లైంది... నీవు...ఇక్కడకువచ్చి ? '

' రెండో నెల...జరుగుతూంది తల్లీ ... '

' ఇంతేనా... '

' ఇదన్నా ...పూర్తిగా అయితే... '

' అదేం ...'

' మీారు వెళ్ళగానే... నాకు ఉద్వాసన ... '

' ఆఁ...హాఁ...'

' నేనంటే...ఆవిడకు యిష్టంలేదు... '

' ఏం...'

'చూసి...ఊరుకోకపోవడంచేత...చేసే పనులకు...హద్దు లేకుండా...'

'.అపవాదులు...'

'చూసిన కళ్లు...ఇవిగో. ఆవిడను కాదనమను...? మీ మామా...అవిడా...మీరు యింటో లేకుండాచూసి... ఆడిన నాటకం...'

'సరేలే... నీ కెందుకు...వెళ్లు...'

'చాడీలుకావు తల్లీ...అంచాయించే యిన్నాళ్లనుంచీ... ఎందుకైనా మంచిది...వివేకవంతురాలవని...నీతో చెప్పాను...'

'బాగుంది...'

'ఆయనకూడా...'

'ఇక ...చాలించు...'

'కోపమా అమ్మ! ...'

'ఎవరిమీద... ? కోపమేమిటి...కూలిపోతూంటే...'

—సీత...ఆలోచించుతూ...పాక్‌నుంచి తెప్పరిలని తోటు(?) పాటుతో...నడుస్తూవుంటుంది. ఆమె ఎదురవుతుంది. సీత...తల ఎత్తదు:

ఆమె, సీత చెయి పట్టుకుని— 'నీకోసమే ... వెదుకు తున్నాను...'

'నల్లపూసనా...కనబడకపోవడానికి...అందులోనీ కంటికి?'

'ఓమారు...నా గదిలోకి...రా...'

'ఎందుకూ ?'

'రా...నీకే అర్థమవుతుంది...'

'అన్నీ ...అర్థమవుతూనే ఉన్నాయి...'

# పద్మావళీ పరిషత్
## మచిలీపట్టణము

⊙ * ⊙

— క్రమశః వెలువడే గ్రంథములు —

**సమీక్ష** [ వ్యాసావళి ]

—కృష్ణాపత్రికనుండి పునర్ముద్రితము

**కిరణావళి** [ గేయమాల ]

— " అజ్ఞాతకవి "

**కింకిణీమాల** [రూపక సంహిత]

—శ్రీ వెంపటి నాగభూషణం

**గోపీదేవి** [ కావ్య-రూపకము]

—శ్రీ మల్లాది రామకృష్ణశాస్త్రి

*

---

మేనేజరు

**కృష్ణాపత్రికా కార్యాలయము**

**మచిలీపట్టణము**

